ఇహైవ నరకవ్యాధే
శ్చికిత్సాం న కరోతి యః
గత్వా నిరౌషధం దేశం
వ్యాధిస్థః కిం కరిష్యతి.

నరకమను వ్యాధికి శాస్త్రములు, సద్గురువులు, సాధనలు మున్నగునవి ఔషధములు. అవి ఈ భూలోకమందే లభించును. కావున ఈ లోకమందే, ఈ మానవజన్మయందే నరకవ్యాధికి ఎవడు (భక్తి జ్ఞాన వైరాగ్యాది సాధనలద్వారా) చికిత్స గావించుకొనడో, అట్టివాడు తన రోగనివారణకై ఔషధములులేని ఇతరలోకములకు బోయి - ఏమిచేయగలడు? కాబట్టి ఇపుడే పుణ్యమును, జ్ఞానమును సముపార్జించి సంసార దుఃఖమును శీఘ్రముగ అంత మొనర్చుకొనవలెను.

# యమలోక వార్తలు





శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీకాళహస్తి

1981 [ వెల : రు. 1-50

7 వ కూర్పు వరకు—21,000
8 వ కూర్పు 1981—2,000

మానుషం దుర్లభం ప్రాప్య నిత్యం యస్తు న సాధయేత్
స యాతి నరకం ఘోరం కోఽన్యస్తస్మాదచేతనః. 1

దుర్లభమగు మనుష్యజన్మను బడసియు నిత్యమై, సత్యమైనట్టి ఆత్మనుగూర్చి యెవడు ప్రయత్నింపకుండునో, అట్టివాడు తన అజ్ఞానఫలితముగ ఘోరమగు నరకమును బొందును. అట్టివానికంటె జడమైనవాడు వేఱొకడెవడుండ గలడు?

అస్థిరేణ శరీరేణ యోఽస్థిరైశ్చ ధనాదిభిః
సంచినోతి స్థిరం ధర్మం స ఏకో బుద్ధిమాన్నరః
తస్మాత్సర్వప్రయత్నేన కర్తవ్యో ధర్మసంచయః. 2

అస్థిరమును, క్షణికమునగు మనుష్యశరీరమును బొందియు అస్థిరములగు ధనాదులను బడసియు ఎవడు స్థిరమగు ధర్మమును సముపార్జించునో ఆతడొకడే బుద్ధిమంతుడగును. కాబట్టి సర్వప్రయత్నములచేతను, ధర్మమునే సంపాదించవలెను.

(యమధర్మరాజు)

ముద్రణ:
ఫ్రీడమ్ ప్రెస్,
మద్రాసు - 600 021.

# విషయసూచిక

'ఆపదం నరకం ఘోరం గీతాధ్యాయీ న పశ్యతి' 1

భగవద్గీతను అధ్యయనము చేయువాడు, ఆపత్తులను గాని, ఘోరమగు నరకమునుగాని యెన్నటికిని చూడకయే యుండును.

కాలకాలం ప్రపన్నానాం కాలః కిం ను కరిష్యతి. 2

కాలునకు కాలుడైన పరమేశ్వరుని శరణుజొచ్చిన వారిని ఇక కాలుడు (యముడు) ఏమిచేయగలడు?

చంద్రశేఖరమాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః. 3

నేను చంద్రశేఖరుడను పరమేశ్వరుని ఆశ్రయించె దను. అట్టి నన్ను ఇక యముడేమి చేయగలడు?

# ప్రస్తావన

ప్రతిజీవియు ఆనందముకొఱకై తహతహలాడు చున్నాడు. దుఃఖమును పోగొట్టుకొనుటకై తీవ్రముగ అభిలషించుచున్నాడు. బంధవిముక్తికై ఉత్కంఠను వెలిబుచ్చుచున్నాడు. మోక్షమునకై అఱ్ఱులు చాచుచున్నాడు. కాని ఆ మోక్షము లభించుటెట్లు? మోక్షమునకు ఆత్మజ్ఞానము అవసరము. ఆత్మజ్ఞానమునకు చిత్తశుద్ధి అవసరము. చిత్తశుద్ధికి సచ్ఛీలము అవసరము. అట్టి సచ్ఛీలము, సత్ప్రవృత్తి మనుజునకు కలుగవలెననిన, అతడు పుణ్యకార్యతత్పరుడై, పాపవిముఖత్వము కలిగి ప్రవర్తించవలసి యుండును. సద్గుణావలంబియై, దుర్గుణములకు లవలేశమైనను తన హృదయమున చోటీయక పాపభీతి కలిగి వర్తించవలెను.

పాపభూయిష్ఠమగు మలినచిత్తముగల జీవికి ఆత్మానుభూతి ఎన్నటికిని కలుగనేరదు. కావున చిత్తకుహరమున దాగియుండు బహుజన్మార్జిత పాపవాసనలను, దుర్గుణములను వివేకముచే జీవుడు ఏరి పారవేయవలెను. సృష్టియందొక అప్రతిహతమగు నియమము (Law) కలదు. 'పాపముచే దుఃఖము, పుణ్యముచే సుఖము, జ్ఞానముచే మోక్షము'— ఇదియే ఆ నియమము. దీనిని ఎవరును తప్పించలేరు.

పాపము చేసినవారు దుఃఖమును అనుభవింపక తప్పదు. ప్రతిపాపకార్యమునకును శిక్ష కలదు. ఆ శిక్షను పాపి విధిగా అనుభవించియే తీరవలెను. శారీరకముగ చేసిన పాపమునకు, దుష్కృత్యమునకు ప్రభుత్వము వారెట్లు దండనను విధించుచున్నారో, అట్లే మానసికముగ ఒనర్చు పాపములకుకూడ విశ్వప్రభుత్వమువారు దండనను విధించుదురు. శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను-అనగా త్రికరణములచే గావింపబడు ప్రతిపాపకార్యమునకును విశ్వప్రభుత్వముచే శిక్ష అవశ్యము విధింపబడగలదు.

విశ్వప్రభుత్వముయొక్క దండన విభాగమునకు అధిపతి యమధర్మరాజు. దండించు క్షేత్రము నరకలోకము. పాపులచట వారివారి దుష్కృత్యములకు తగిన శిక్షలననుభవించుచుందురు. నానాయాతనలను పొందుదురు. అచట వారిబాధలు వర్ణనాతీతములు. పూర్వ మొకపుడు గరుత్మంతుడు విష్ణుభగవానుని నరకలోకవృత్తాంతమును గురించి ప్రశ్నించియుండెను. 'మహాత్మా! నరకలోక మెట్టిది? అచట పాపాత్ము లేయేవిధముగ వారి కర్మఫలముల ననుభవించుచుందురు? ఏయే పాపమునకు ఏయేశిక్ష లభించును?'-అని యీ ప్రకారముగ మిగుల ఉత్సుకతతో ప్రశ్నించిన గరుత్మంతునకు విష్ణుభగవానుడు విపులముగ ప్రత్యుత్తరమొసంగియుండెను. నరకలోకమున జరుగు వృత్తాంతమంతను వైకుంఠనాథుడు గరుత్మంతునకు చక్కగ వివరించి చెప్పెను.

అదియంతయు వివిన మీదట గరుత్మంతుడు పాపాత్ముల వికృతచేష్టల ఘోరపరిణామమునకు భీతిల్లి, వారనుభవించు భయంకరదుఃఖములు తలంచుకొని ఆశ్చర్యచకితుడై, ఆ నరకయాతనలనుండి జీవుడు తప్పించుకొను ఉపాయము సెలవిండని ప్రార్థింప, అంతట విష్ణుభగవానుడు వైరాగ్య బోధోపరతులను చక్కగ వివరించి చెప్పెను. యమబాధా నివారణకు ఉపాయము సెలవిచ్చెను. మానవజన్మను బడసిన జీవుడు ఒక్క నిమిషమైనను వ్యర్థముచేయక భక్తి వైరాగ్యములద్వారా, తత్త్వచింతనద్వారా స్వస్వరూప సాక్షాత్కారమును బడసి కృతార్థుడు కావలయుననియు, ఇట్టి సాధనరూపసదవకాశము ఒక్క మానవజీవితమునందే లభ్యమగుననియు కావున అనవరతప్రయత్నములచే తన హృదయక్షేత్రమును లెస్సగ పరిశోధించుకొని, దుర్గుణము లను చీడపురుగులను ఏరి పారవైచి, సద్గుణములను అభివృద్ధిపఱచుకొని మోక్షసామ్రాజ్యమును బడసి నిరతిశ యానందమును పొందవలయుననియు విష్ణుభగవానుడు గరుత్మంతునకు చక్కగ వివరించి చెప్పెను. ఈ విషయ మంతయు గరుడపురాణమున గలదు.

అట్లు విష్ణుభగవానుడు గరుత్మంతునకు తెలిపిన విశే షము లన్నిటిని క్రోడీకరించి 'యమలోకవార్తలు' అను గ్రంథమును వెలువరించితిమి. పాపకృత్యమునకు లభించు శిక్ష ఎంత ఘోరమైనదో ముందుగనే తెలిసియున్నచో అట్టి పాప

కార్యములనుండి విముఖులగుటకు జనులకు కొంత అవకాశము ఏర్పడగలదు. కావున యమలోకవార్తలను తెలిసికొనినవారికి పాపవిముఖత్వభావము అవశ్యమేర్పడి పుణ్యకార్యములందు, ఆధ్యాత్మికసాధనలందు ఆసక్తి జనింపగలదు. దానిచే బంధవిముక్తి, మోక్షము సిద్ధించగలదు. కావున ముముక్షువులగువారు యమలోకవార్తలను తెలిసికొని హృదయపరిశోధన గావించుకొని, పాపమునకు తిలాంజలి యొసంగి, పుణ్యకార్యతత్పరులై, జ్ఞానార్జనముచే ముక్తిని బడసి కృతార్థులగుదురుగాక!

ఇట్లు,
ప్రకాశకులు.

# యమలోక వార్తలు

(పాపాత్ముడు మరణించినపిదప ఎట్టి అనుభవములను పొందునో, యమలోకమున నెట్టి భయంకరయాతనల ననుభవించునో, ఆవిషయముల నన్నింటిని పూర్వము గరుడపురాణమున విష్ణుభగవానుడు గరుత్మంతునకు జెప్పియుండెను. వాని నన్నింటిని 'యమలోకవార్తలు' అను ఈ పుస్తక రూపమున ప్రకటించుచున్నాము. దీనిని గూర్చి తెలిసికొనినచో ఇక జనులకు పాపవిముక్త్యము, సద్గుణావలంబనము తప్పక కలుగగలవు.)

## యమలోక వర్ణన

విష్ణురువాచ:-(విష్ణువు గరుత్మంతున కిట్లు బోధించెను.)

ఓ గరుత్మంతుడా! దక్షిణ నైరృతి దిక్కులకు మధ్య యమపురము కలదు. సురాసురులకు అభేద్యమై, చతురస్రముగ, ఉన్నత ప్రాకారయుక్తమై, నాలుగు ద్వారములు కలిగి, వేయి యోజనముల విస్తీర్ణము గలిగి ఆ యమ పట్టణము విరాజిల్లుచుండును. అచట సుందరమైన చిత్రగుప్త మందిరము కలదు. అది ఇరువదియైదు ఆమడల వెడల్పును, అంతియే పొడవును గలిగి, లోహప్రాకార వేష్టితమై, పదంతస్తుల మేడలతో గూడి, అనేక ఉద్యానవనంబులతోను, ఉపవనంబులతోను శోభిల్లుచు నుండును. అచట చిత్రగుప్తుడు పరమాశ్చర్యకరమగు సింహాసనమున గూర్చుండి జీవుల ఆయు

ర్ధాయమును నిర్దుష్టముగ లెక్కించుచుండును. వారివారి పుణ్యాపాపములను పరిగణించుచు ఏ మాత్రము తేడా లేకుండ అతడు లెక్కవేయుచుండును. అతని శాసనాను సారమే జనులు వారివారి పుణ్యాపాపములకు ఫలములగు సుఖదుఃఖముల ననుభవింపవలసియుండును.

చిత్రగుప్తుని మందిరమునకు తూర్పు భాగమున జ్వర గృహము, దక్షిణ భాగమున శూలరోగ గృహము, లూతా విస్ఫోట గృహము, పశ్చిమభాగమున యమపాశ గృహము, ఉత్తరమున రాజయక్ష్మ పాండురోగుల గృహము, ఈశాన్య దిశయందు శిరోరోగ గృహము, ఆగ్నేయమున మూర్ఛనా గృహము, నైరృతి దిశయందు అతిసారగృహము, వాయువ్య దిశయందు శీతదాహగృహము కలవు. ఈ ప్రకారముగ ఆ యా గృహంబుల మధ్య చిత్రగుప్తుడు జనుల శుభాశుభ ములను వ్రాయుచుండును.

ఆ చిత్రగుప్తాలయమునకు ముందుభాగమున ఇరువది యోజనముల దూరమున యమధర్మరాజమందిరము కలదు. రత్నమయమై, విద్యుత్సమాన కాంతియుతమై, రెండు వందల యోజనముల పొడవును, అంతియే వెడల్పును గలిగి, సహస్రస్తంభమండితమై, నానాహర్మ్యప్రసాదసంయుక్తమై, విశ్వకర్మచే యోగప్రభావమున నిర్మితమై అయ్యది వెలయు చున్నది. సర్వాభరణభూషితుడై, మకరకుండలాలంకృ తుడై, కిరీటమును ధరించి యమధర్మరాజచట విరాజిల్లు చుండును. మృత్యువు, పాశహస్తుడగు కాలుడు, చిత్ర

గుప్తుఁడు, కృతాంతుడు ఆ యముని సేవించుచుందురు. అతని చుట్టు పాశదండధరులును, మహాబలశాలురును నగు యమభటులు ఉందురు. ధర్మనిర్ణేతలు ధర్మశాస్త్రములకు యథార్థమగు వ్యాఖ్యను గావించుచు యముని సేవించు చుందురు. పక్షపాతము, అబద్ధము, మాత్సర్యము అచట లేవు. పాపాత్ములు యమలోకమునకు దక్షిణ మార్గము గుండా వెళ్ళుదురు. ధర్మరాజుయొక్క ఆ సభను వారు చూడజాలరు,

## యమలోక మార్గము

ఓ గరుత్మంతుడా! పుణ్యాత్ములు, భగవద్భక్తులు, జ్ఞానవంతులు, నరలోకమున కెన్నటికిని పోరు. పాపకార్య పరాయణులు, దయాధర్మవివర్జితులు, దుస్సాహసపరులు, శాస్త్రపరాఙ్ముఖులు, వినయవిహీనులు, ఐశ్వర్యమదమత్తులు, అసురస్వభావయుతులు, దైవసంపద్రహితులు, మనోవికార యుక్తులు, కామమోహపరాయణులు మాత్రమే నరక లోకమునకు జని పెక్కు బాధల ననుభవించుచుందురు,

పాపాత్ముడు అంత్యకాలమున శ్లేష్మముచే బంధింప బడిన నాడులు కలవాడై, శ్వాసకాసలచే ఆయాసమును బొందుచు పరుండి, బంధువులందఱును చుట్టుముట్టి ఏడ్చు చుండ కంఠమునుండి గురక బయలుదేరగా కాలపాశబద్ధుడై మరణించును. ఆ మరణకాలమున జీవునకు దివ్యదృష్టి కలు

గును. జగత్తంతయు కరతలామలకముగా కాన్పించును. కాని అప్పుడేమియు పలుకజాలకుండును. చైతన్యము విలుప్తము కాగా సమీపముననున్న యమభటులు ప్రాణములను వానిస్థానములనుండి తొలగించివేయుదురు. ఈ ప్రకారముగ శ్వాస స్వస్థానమునుండి చలింపగ ఆ క్షణము జీవునకు కల్పసమానముగా తోచును అప్పుడు వందలకొలది తేళ్ళు కుట్టిన ఎంత బాధ కలుగునో అంత బాధ యాతనకి కలుగును.

అప్పటి శ్లేష్మము వెడలును. నోటినుండి చొంగ కారును. పాపాత్ముల ప్రాణవాయువులు అధోమార్గమున జనును. అపుడు జీవుడు భయంకరులును, కోపారుణిత నేత్రులును, పాశములను, దండములను ధరించినవారును, దిగంబరులును, పళ్ళు పటపటకొరుకువారును, ఊర్ధ్వకేశులును, కాకులవలె నల్లనివారు, వంకర మొగములు కలవారు, గోళ్ళే ఆయుధములుగ గలవారును నగు యమదూతలను జూచి భయపడి మూత్రపురీషములను వదలును.

జీవుడు అంగుష్ఠమాత్రుడై స్థూలదేహమునుండి హాహాకారములతో బయలుదేరి తన గృహమును జూచుచు నుండ యమభటులచే పట్టుకొనబడును. యమదూతలు జీవుని యాతనాదేహమున బంధించి బలాత్కారముగ కంఠమున పాశములను తగిలించి నేరము జేసినవానిని రాజభటులు దండించునట్లు దండించుచు చాలదూరము తీసికొనిపోవుదురు. దారిలో వారు తర్జనభర్జన చేయుచు భయంకరములైన నరకవృత్తాంతముల నాతనికి జెప్పుచు 'ఓరీ! పాపీ! త్వరగా

వదువ్రుము. నీ విపుడు యమసదనమునకు బోవుచున్నావు. త్వరలోనే నిన్ను కుంభీపాకాది ఘోర నరకములందు కూల ద్రోసెదము' అని పలుకుచు ఇష్టమువచ్చినట్లు కొట్టుచునుండ జీవుడు హాహాకారములు సల్పుచుండును. మఱియు వారి యార్భాటముచే గుండెలదరిపోవ, వణకుచు వారిలో కుక్క-లచే కఱువబడుచు, తాను చేసిన పాపములను తలంచు కొనుచు గొప్ప ఆకలిచేతను దప్పికచేతను బాధపడుచు, ఎండ కొరడుదెబ్బలు, పిడుగాదులచే తాపము నొందుచు యమ భటులు కొఱడాలతో వీపులపై కొట్టుచుండ నడువ శక్తిలేక కాలిన ఇసుకదిబ్బలమీద ఎట్లో కష్టముతో నడచుచుండును.

ఈ ప్రకారముగ అతికష్టముమీద నడక కొనసాగించుచు మధ్యమధ్య పడుచు లేచుచు అలసిపోయి గాఢాంధకారమున యమలోకము జేరును. అచట యమదూతలు జీవునకు ఘోరములగు నరకయాతన లన్నిటిని జూపి యము దర్శనముగూడ చేయించెదరు. యముని ఆజ్ఞచే భటులా జీవుని ఆకాశమార్గమున తిరిగి భూలోకమునకు గొనివచ్చుదురు. కర్మబద్ధుడగు ఆ జీవుడు భూలోకమున తన పూర్వపు దేహమున ప్రవేశింపగోరును. కాని యమభటు లాతనిని పాశములచే దృఢముగ బంధించియుండుటవలన అకార్యమున నిష్ఫలుడగును. ఆకలిదప్పులకు ఓర్వలేనివాడై యతడు ఏడ్చును. పుత్రులచే నీయబడు పిండములను, ఆతురదానములను స్వీకరించును. అయినను నాస్తికుడగు ఆ పాపాత్ముడు వానిచే తృప్తిం బొందకుండును. మృతినొందినవారికి ఔర్ధ్వ

దైహిక క్రియలను జనులు మానరాదు. ఏలయనగా, అట్లు మానినచో మృతజీవులు బహుదుఃఖితులై పిశాచరూపములతో నిర్జనారణ్యములందు కల్పాంతమువఱకు తిరుగాడుచుందురు. చేసికొనిన కర్మను ఎవరైనను అనుభవింపక తప్పదు.

నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి
అభుక్త్వా యాతనాం జన్తుర్మానుష్యం లభతే నహి.

చేసికొనిన కర్మము అనుభవింపనిచో కోట్లకొలది కల్పములకైనను క్షయింపనేరదు. మఱియు ఆయా దుష్కర్మల ఫలములగు యమయాతనల ననుభవించినగాని తిరిగి మానవజన్మ లభింపదు.

భూలోకమునుండి యమపురము ఎనుబదియారు వేల యోజనముల (ఆమడల) దూరమున గలదు. (వైతరణీనది యొక్క వైశాల్యమును లెక్కచేసికొనినచో). రోజునకు కొంత కొంత దూరము చొప్పున ప్రయాణించుచు మృతినొందిన యా జీవుడు యమసదనమునకు కొద్ది రోజులలో చేరును. మార్గమధ్యమున నతడు 1. సౌమపురము 2. సౌరిపురము 3. నగేంద్రపురము 4. గంధర్వనగరము 5. శైలాగమపురము 6. క్రౌంచపురము 7. క్రూరపురము 8. విచిత్రభవనము 9. బహ్వాపదపురము 10. దుఃఖదపురము 11. నానాక్రందపురము 12. సుతప్తభవనము 13. రౌద్రపురము 14. పయోవర్షణపురము 15. శీతాఢ్యపురము 16. బహు

భీతిపురము - అను పదునాఱుపురములను దాటి ఏడ్చుచు తుదకు యమాలయమును చేరును.

పాపి యమలోకమునకు బోవు మార్గమున చెట్లనీడ యుండదు. ఆకలి దీర్చుకొనుటకు అన్నాదులు లభింపవు. నాలుక ఎండిపోవుచున్నను నీళ్లు దొరకవు. ద్వాదశాదిత్యులు ప్రళయకాలమునందువలె అచ్చట సదా వెలుగొందు చుందురు. అట్టి మార్గమున పాపాత్ములగువారు నడచి పోవుచుందురు.

మఱియు ఆ మార్గమున చలిగాలి భోరున వీచు చుండును. కాళ్ళలో ముండ్లు గ్రుచ్చుకొనుచుండును. ఒక్కొక్క చోట విషపూరితములగు సర్పములు కఱచును. సింహములు, కుక్కలు మొదలగు క్రూరజంతువులు బాధించును. తేళ్ళు కుట్టును. అగ్ని దహించును. ఒకచోట రెండువేల యోజనముల పొడవును వెడల్పును గలదియు మహా భయంకర మైనదియు, కాకులు, గ్రద్దలు, గుడ్లగూబలు, తేనెటీగలు, దోమలు మున్నగువానిచే నిండినదియు నగు అసిపత్రవనము కలదు. దాని చెట్ల ఆకులు కత్తులవలె నుండును. జీవుని యాతనాదేహ మా యాకులచే ఛేదింపబడుచుండును. ఆ వనమునందు దావాగ్నియు కలదు.

పాపి యమలోకమునకు పోవుచు దారిలో నొక్కొక్క చోట అంధకారవృతములగు భయంకర కూపములందు పడిపోవును. పర్వతాగ్రములనుండి కూలబడును. పదునైన

కత్తులమీదను, మేకులమీదను నడచును. అక్కడక్కడ నిప్పులవాన, రాళ్ళవాన, పిడుగులు, రక్తపువాన, ఉష్ణ జలము, ధూళి, బురద మీద పడుచుండును. ఒక్కొక్కచోట అగాధములగు గోతులలో పడుచుండును. ఒకొకచోట ఉన్నతములగు గుట్టలెక్కుచుండును. చీము, రక్తము, మలము మున్నగు మలినపదార్థములతో నిండియుండు మడుగులలో కూలబడుచుండును.

## వైతరణీనది - దారుణ యమలోక ప్రయాణము

ఈ యమలోకమార్గముననే 'వైతరణీ' నది కలదు. దాని వెడల్పు నూరు ఆమడలు. దానియందు చీము, రక్తము నిరంతరము ప్రవహించుచుండును. దాని తీరములు ఎముకల గుట్టలచే నిండియుండును. మాంసము, రక్తమే అందలి బురద. వెంట్రుకలే అందలి నాచు. దానియందు భయంకరములైన మొసళ్ళు, క్రూర పక్షులు అనేకములుండును. ఆ నది పాపాత్ముని జూచిన వెంటనే సెగల తోడను, పొగలతోడను నిండి సలసలక్రాగుచు మఱింత భయంకరముగ తోచును. మఱియు సూదులవంటి ముక్కులు గల పురుగులతోడను, వాడియైన నాసికాగ్రములుగల గ్రద్దలతోడను, బొంతకాకులతోను, మాంసభక్షకులై

నీటికోతులతోను, మొసళ్లు, జలగలు, చేపలు, తాబేళ్లు మొదలగు భయంకర జలజంతువులతోను కూడియుండును.

పాపులగు జీవులా నదియందు పడి అచట బాధలు పడలేక 'అన్నా, నాయనా, కుమారా' అని పలుమారు మరల ఏడ్చుచుందురు. మఱియు ఆకలిదప్పిక తీర్చుకొనుటకు సాధనము లేక అందలి రక్తమునే త్రాగుచుందురు. ఆ నది పెద్ద పెద్ద ధ్వనులు చేయుచు రక్తముతోను మాంసముతోను కూడి పారుచు తరగలదై మహా మలినమై మహాభయంకరముగ నుండును.

పెక్కు తేళ్లు నల్లత్రాచులు నిండియున్న ఆ నదియందు పడిన పాపాత్ములను రక్షించువారెవ్వరును లేరు. పాపులా నదియందలి పెద్దపెద్ద సుడిగుండములలో పడి క్రిందకు ద్రొక్కుచు మరల పైకి ఎగురగొట్టబడుదురు. ఈ నది పాపాత్ముల కొఱకే ఏర్పడినది. దీని మించిన భయంకరమైన నది వేఱొకటి యుండబోదు. ఈ ప్రకారముగ వివిధ దుఃఖములచే పరిపూర్ణమైన ఆ యమమార్గమున పాపులు పోవుచుందురు.

యమలోకమార్గములో పాపాత్ములగు కొందఱిని యమదూతలు త్రాళ్ళచే బాధించి తీసికొని వెళ్లుదురు. మఱి కొందఱిని వీపుపై శూలములు గ్రుచ్చి తీసికొనిపోవుదురు. కొందఱిని ముక్కుకు త్రాళ్లు కట్టి లాగుకొనిపోవుదురు. చెవులకు దారములు కట్టి కొందఱిని ఈడ్చుకొనిపోవుదురు. పాపులగు

కొందఱిని కాళులు లాగుచుండును. మెడలకు, చేతులకు, కాళ్లకు, వీపులకు బరువైన ఇనుపసంకెళ్లను తగిలించి తలపై ఇనుపకడ్డీలను బెట్టి యమభటులు పాపులను తోలుకొని పోవుదురు. భయంకరులగు యమదూతలు గదాది సాధనములచే పాపాత్ములను బాదుచుండ, ఆ బాధలకు తట్టుకొనలేక ఎట్లో కష్టముతో అనుభవించుచు నోటినుండి రక్తమును గ్రక్కుచు మఱల దానినే త్రాగుచు వెడలుచుందురు. ఇవ్విధముగ పాపులు తాము చేసిన పాపకృత్యములకు తగిన ఫలముల ననుభవించుచు మహాప్రయాసతో యమమందిరమునకు బోవుదురు. పాపాత్ముడు ఆ మార్గమున తన కొడుకులను, మనుమలు మున్నగువారిని మఱల మఱల తలంచుకొని దుఃఖించుచుండును. మఱియు తన పాపచరితములను గూర్చి ఈ క్రింది విధముగ వాపోవుచుండును.

మహతా పుణ్యయోగేన మానుషం జన్మ లభ్యతే
తత్ప్రాప్య న కృతో ధర్మః కీదృశం హి మయాకృతమ్.

"గొప్ప పుణ్యము చేతనే మనుష్యజన్మ లభించును. దుర్లభమగు అట్టి జన్మను బొందియూ నేనేల ధర్మకార్యములను జేయలేదు? అయ్యో! వెఱ్ఱివాడనైతిని, తపస్సు గావింపలేదు, దేవపూజలను చేయనేలేదు. దానధర్మములను ఒనర్చలేదు. యజ్ఞాదిక్రతువులను స్వప్నమందైనను దలంపలేదు. తీర్థయాత్రలను యథావిధిగ గావింపలేదు. బ్రహ్మనిష్ఠులను పూజింపలేదు. గంగానది పుణ్యానదులను సేవింపలేదు. సజ్జనుల నాశ్రయింపలేదు. వారల పరిచర్యనైనను ఒనర్చ

లేదు. పరోపకారమును గావింపలేదు. అయ్యో! నేను చేసిన పాపకృత్యములఫల మెవ్వ రనుభవించెదరు!

"మఱియు మనుష్యులకొఱకుగాని, పశుపక్ష్యాదుల కొఱకుగాని నిర్జలప్రదేశములందు నేను జలాశయములను (బావులను, చెఱువులను) త్రవ్వింపలేదు. గోవులవిషయమున గాని, బ్రాహ్మణులవిషయమునగాని ఏవంతైనను పుణ్యములు గావింపలేదు. ఎవరికిని అన్నదానము నేమియు చేయలేదు. గోవులకు ఒకనాడైనను కడుపునిండ గడ్డి వేయలేదు. నాస్తికుడనై, వేదశాస్త్రములను విశ్వసించక స్వేచ్ఛగా తిరుగాడితిని. పురాణములను శ్రవణము చేయలేదు. పౌరాణికులను పూజింపలేదు. అయ్యో! నేను చేసిన పాపకృత్యముల ఫల మెవ్వ రనుభవించెదరు!

పాపియగు స్త్రీ ఈ ప్రకారముగ తలపోయుచుండును—

"నన్ను కంటికి రెప్పవలె కాపాడు భర్తమాటను ఒక్కసారైనను వినలేదు. భర్తను సేవింపవలయునను నీతిని స్వప్నమందైనను దలపకుంటిని, అత్తమామలు మున్నగు వారిని గౌరవింపలేదు. భర్తను ధర్మబుద్ధితో సేవింపలేదు. వ్రతములను, ఉపవాసాదులను గావింపలేదు. అయ్యో! నేను చేసిన పాపముల నెవరనుభవించెదరు?"

ఏవం విలప్య బహుళస్సంస్మరన్ పూర్వదైహికం
మామకత్వం మమ కుత ఇతి క్రోశన్ప్రవర్తతి.

అని యీ ప్రకారముగ పరిపరివిధముల విలపించుచు పాపాత్ముడగు జీవుడు తన పూర్వకృతపాపములను సంస్మరించుకొని 'మఱల నాకు మనుష్యజన్మ యెప్పుడువచ్చునో' అని యేడ్చుచు ఆ యమలోక మార్గమున బోవుచుండును.

అట్లు వాయువేగమున పదునేడుదినములు నడచి తుదకు పదునెనిమిదవ దినమున సౌమ్యపురమును జేరును. రమ్యమగు ఆ పట్టణమున ప్రేతగణము నివసించుచుండును. మఱియు నచట పుష్పభద్రయను నది ప్రవహించుచుండును. విశ్రమించుటకు అనుకూలమైన పెద్ద మఱ్ఱిచెట్టున్న అచ్చోటు గలదు. యమభటులు పాపాత్ముల నచట విశ్రమింపజేయుదురు. అట్లు విశ్రమించియున్న సమయమున వారికి తమ భార్యలు, బిడ్డలు, బంధువులు, ధనము, సౌఖ్యములు స్మరణకు రాగా పరిపరి విధముల శోకింతురు. వారినిజూచి యమదూతలిట్లు పరిహసించుదురు—

క్వ ధనం క్వ సుతా జాయా క్వ సుహృత్క్వచ బాంధవాః
స్వకర్మోపార్జితం భుక్త్వా మూఢ యాహి చిరం పథి.

మూఢులగు ఓ జీవులారా! ధనమెచ్చట? పుత్రులెచట? భార్యయెచట? మిత్రులెచట? బంధువులెచట? వారినిగూర్చి తలంచుకొనుట వ్యర్థము. మీరు చేసిన కర్మలను ఫలమును మీరనుభవించియే తీరవలెను. కావున లెండు! చిరకాల మీ బాధాకరమగు నడకను కొనసాగింపుడు. ఓ మూర్ఖులారా! ప్రయాణీకులకు దారిబత్తెమే (పుణ్యమే) అతిముఖ్యమైనదని మీకు తెలియదా? తెలిసినచో దానికై

మేల ప్రయత్నము సలుపకుంటిరి? ఏ మార్గమున బోవువారును, అన్నవారును ఉండరో అట్టి మార్గమున పోవలసి వచ్చునని మీరు తెలియరా? పరలోకమార్గమున ఏమియు దొరకదని పసిపిల్లలకుకూడ తెలియును, మీకేల తెలియదు? పెద్దలవలన బోధల నెప్పుడును వినలేదా?

పాపాత్ములకు యమభటులిట్లు హేళనచేయుచు కఱ్ఱలచే బాదుచుండ, వారు పడుచు, లేచుచు పరుగెత్తుచు పుత్రాదులచే మాసికములం దీయబడిన పిండములను దినుచు క్రమముగ సౌరిపురమును జేరుదురు.

ఆ సౌరిపురమును జంగముడను రాజు పాలించుచుండును. అతడు సాక్షాత్తుగ యమునింబోలి యుండును. అతనిని జూచి పాపాత్ముడు భయకంపితుడై విశ్రమించుటకు, స్థలమును జూచుకొనును. అచ్చోట జీవుడు పుత్రాదులచే త్రైపక్షిక శ్రాద్ధమున నీయబడిన పిండోదకముల ననుభవించి తదుపరి యటనుండి బయలుదేఱును.

రెండవమాసము దాటిన తరువాత పాపి నగేంద్రభవన పురమును చేరుకొనును. అచటగల భయంకరములైన అసిపత్రారణ్యములను జూచి యాతడు ఏడ్చును. యమభటు లాతనిని ఆ యరణ్యమున నిర్దయులై ఈడ్చుకొని పోవుదురు. పాపాత్ము డా బాధలకు తట్టుకొనలేక వెక్కి వెక్కి యేడ్చుచుండును. అచట పిండములను భక్షించిన తరువాత యమదూత లతనిని పాశములతో బంధించి ముందునకు గొనిపోవుదురు. మూడవ మాసమున గంధర్వ

పురమును, నాల్గవ మాసమున శైలాగమపురమును జేరుకొనును. ప్రేతలమీద నిరంతరము ధారాపాతముగ రాళ్ళవాన కురియుచుండును గాన అచ్చోటునకు శైలాగమ పురమని పేరు గల్గినది. నాల్గవమాసము పిండముల నచట భుజించి ఒకింత సుఖమును బడసి పాపి ఐదవమాసమున క్రౌంచపురమును జేరుకొనును. ఆ పురమందలి ప్రజలందఱును హింసకులే యగుటంబట్టి దాని కాపేరు వచ్చినది. తదుపరి క్రూరపురమును జేరును. అచటి ప్రజలు మహాక్రూరులై వర్తించుదురు.

అచ్చోట పుత్రాదులచే నీయబడిన పిండోదకాదులను భుజించి, వానితోపాటు ఉదక కుంభదానములవలన ఒకింత తృప్తుడై రెండు గడియల కాలము మాత్రము విశ్రమించి తదుపరి యా పురమును వీడి యమదూతలచే బాధింపబడుచు వడకుచు బయలు దేఱును. పిమ్మట పాపాత్ముడు విచిత్ర భవనమను పట్టణమును జేరును. యముని సోదరుడగు విచిత్రరాజు పట్టణమును పాలించుచుండెను. భీకర శరీరుడగు ఆతనిని గాంచి పాపాత్ముడు భయకంపితుడై పాఱిపోవును. అత్తఱి పల్లెవాండ్రు కొందఱాతనికి ఎదురుగా వచ్చి ఆతనితో నిట్లు పలుకుదురు-

వయం తే తర్తుకామాయ మహావైతరిణీం నదీమ్
నావమాదాయ సంప్రాప్తా యది తే పుణ్యమీదృశమ్.

ఓ జీవుడా! మేము అతి విశాలమగు వైతరణీ నదిని దాటించు పల్లెవారము. నావ సిద్ధముగా నున్నది. నీవు

గోదాన మొనర్చితివా! అట్లైన నీవీ పడవ నెక్కవచ్చును; లేకున్న లేదు' — ఆ వాక్యములను విని జీవుడు తాను గోదాన మొనర్పకున్నచో 'హా! దైవమా!' అని విలపించును. గోదానము చేయని జీవునిజూచి ఆ నది సలసల కాగ దొడంగును. దానినిజూచి జీవుడు గడగడ వణకిపోవును. గోదానము చేయని జీవుడు ఆ భయంకరమైన వైతరణీనదిలో మునిగి పోవలయును. గాలముతో చేపను పైకిలాగు విధమున ఆ పాపాత్ముని నోటిలో ముల్లు గ్రుచ్చి యమభటులు ఆకాశ వీధిని నడచుచు నదిని దాటించెదరు. అప్పుడు జీవుడు ఆఱవ మాసమున పుత్రాదులచే నీయబడిన పిండోదకములను భక్షించియు, ఆకలి తీరనందున ఏడ్చుచు బయలుదేఱును.

ఈ ప్రకారముగ పాపాత్ముడు ఏడవమాసమున బహ్వాపదపురమున ప్రవేశించును. పిమ్మట ఎనిమిదవమాసమున ఆకాశమార్గముగుండా దుఃఖద నగరమును జేరుకొనును. తొమ్మిదవ నెల పూర్తియగునప్పటికి నానాక్రందపురమును జేరును. అచటగల ప్రేతగణములు పలువిధములుగ దుఃఖించుచుందురు. కావున ఆ పట్టణమునకా పేరు వచ్చినది. అచ్చోట పాపాత్ములు చేయు రోదన ధ్వనులను విని జీవుడు భగ్నహృదయుడై ఏమి చేయుటకును లేక తాను కూడ వారితో బాటు ఏడ్వదొడగును.

పిమ్మట పదునొకండవమాసమున రౌద్రపురమును తదుపరి పదునైదు దినములకు పయోవర్షణనగరమును జేరుకొనును. పాపాత్ములకు మహాసంకటములను గలుగజేయుచు

అచ్చోట ఘోరమైన వర్షము కురియుచుండును. సంవత్సరము పూర్తియగునప్పటికి పాపి శీతాఢ్యనగరమున ప్రవేశించును. ఎండ కాయుచుండినను మంచుకంటె నూరురెట్లధికముగా అచట చలి పుట్టుచుండును.

> శీతార్తః క్షుధితస్సోఽపి వీక్షతే హి దిశో దశ
> తిష్ఠతే బాన్ధవః కోఽపి యో మే దుఃఖం వ్యపోహతి.

ఆ చలికి తట్టుకొనలేక అతడు 'ఈ నా బాధను పోగొట్టగల బంధువు లెవరైన గలరా!' యని దశదిశలు పరికించును. ఇట్లు ఖిన్నుడై యున్న యా జీవుని జూచి యమ కింకరులు 'ఓరీ! అట్టి పుణ్యము నీ కెచట గలదు? విచారించిన నేమియు ఫలము లేదు. చేసిన పాపమునకు దుఃఖ మనుభవించియే తీరవలెను!' అని పలుకుచుందురు. ప్రేత అచ్చోటనే ప్రథమాబ్దికమున నీయబడిన పిండోదకాదులను భక్షించి కొంత ధైర్యము వహించును. పిమ్మట అనేక భయముల కాకరమైన బహుభీతిపురమున ప్రవేశించును. యమపట్టణ మచటికి చాల సమీపమున నుండును. అచ్చోట జీవుడు హస్తప్రమాణమైయున్న పిండజ శరీరమును త్యజించును.

అంగుష్ఠమాత్రప్రమాణుడగు జీవుడు పాపకర్మ ననుభవించుటకొఱకై యాతనాశరీరము నధిష్ఠించి పాపాత్ములతో కలిసి వెళ్ళును. పుత్రాదులు శ్రాద్ధకర్మ, దానాదులు సరిగ చేయనిచో పితరుల దృఢబంధనములచే గట్టబడి నానాబాధల ననుభవించుచుందురు. యమపట్టణమునకు

నాలుగు ద్వారములు కలవు. అందు దక్షిణ ద్వారమార్గ మిపుడు వర్ణించి చెప్పబడినది.

* * *

బహుభీతిపురమునకు నలుబదినాలుగు ఆమడల దూరమున యమధర్మరాజుయొక్క బ్రహ్మాండమైన పట్టణము గలదు. అందు నరక బాధల ననుభవించుచుండు పాపాత్ములయొక్క హాహాకారములను వినుటతోడనే పాపియగు ప్రేత ఏడ్వదొడంగును. ఆ యేడుపు వినగనే అచటనుండు పురవాసులు దక్షిణద్వారమున కావలికాచుచుండు ధర్మధ్వజుడను ప్రతీహారికడకేగి పాపాత్ముడొకడు వచ్చియున్నాడని యాతనికి తెలుపుదురు. అంతట ద్వారపాలకుడగు ఆ ధర్మధ్వజుడు చిత్రగుప్తుని దగ్గరకు వెళ్ళి వాని పుణ్యపాపములను తెలియజెప్పును. చిత్రగుప్తుడు దానిని వినయమై యమధర్మరాజున కెఱిగించును. యముడు ఎవరు మహాపాపాత్ములో, నాస్తికులో, దుశ్శీలురో చక్కగ గుర్తెఱుంగును. అయినను వారినిగూర్చి చిత్రగుప్తునితో సంప్రదించును. ఆ చిత్రగుప్తుడు పాపుల దుష్కర్మలనుగూర్చి *శ్రవణులయొక్క అభిప్రాయమును గైకొనును.

శ్రవణులనువారు బ్రహ్మదేవుని పుత్రులు. వారు స్వర్గ మర్త్యపాతాళలోకములందు నిరాటంకముగ సంచరించు

---

*శ్రవణులు = నరకలోకమందు నివసించు ఒకానొక తరగతి సంచార ఉద్యోగస్థులు.

చుందురు. వారికి దూరశ్రవణ దూరదర్శనాది శక్తులు కలవు. వారి భార్యలున్ను అట్టి శక్తులనే కలిగియుందురు. ఆ శ్రవణ పత్నులు ముల్లోకములందుండు స్త్రీలయొక్క చేష్టలన్నిటిని బాగుగా గమనించుచుందురు. ఈ ప్రకారముగ ఆ శ్రవణులు జనులు ప్రత్యక్షముగను రహస్యముగను చేయు పాపములన్నిటిని చిత్రగుప్తునకు ఎప్పటికప్పుడు నివేదించుచుందురు. మనో వాక్కాయములచే జీవుడుచేయు సమస్తపాపకర్మలును ఆ శ్రవణులకు స్పష్టముగ దెలిసిపోవును. దేవమనుష్యాది సర్వ ప్రాణులపైనను వారికి అధికారము కలదు. వారెల్లప్పుడును యథార్థమునే చెప్పెదరు. వ్రతములు, దానములు చేయు వారు, సత్యమునే పలుకువారు, పుణ్యాత్ములువగు మహానీయు లను వారు స్వర్గమునకుగాని, మోక్షమునకుగాని జేర్చుదురు. పాపాత్ములనో (వారి చరిత్రలను యమునకు విన్నవించుట ద్వార) నరకమునకు జేర్చి దుఃఖమును గలిగించుదురు.

ఆదిత్యచంద్రావనిలో యమశ్చ
ద్యౌర్భూమిరాపో హృదయం యమశ్చ
అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సంధ్యే
ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్.

సూర్యుడు, చంద్రుడు, వాయువు. అగ్ని, యముడు, అంత రిక్షము, భూమి, ఉదకము, అంతరాత్మ, యముడు, అహో రాత్రములు, ప్రాతస్సాయంసంధ్యలు, ధర్మము – అను వీరు జనులుచేయు సమస్తకృత్యములను తెలిసికొనుచుందురు.

# యమధర్మరాజు, చిత్రగుప్తుడు

యయధర్మరాజు, చిత్రగుప్తుడు, శ్రవణులు, సూర్య చంద్రాదులు తమతమ స్థానములనుండియే జనుల పుణ్య పాపములనన్నిటిని గమనించుచుందురు. యముడు పాపాత్ముల యొక్క పాపములను బాగుగ నిశ్చయించి వారిని బిలిచి మహాభయంకరమగు తన నిజరూపమును జూపును. దండ హస్తుడును, మహాశరీరుడును, దున్నపోతునెక్కియున్న వాడును, ప్రళయమేఘధ్వనిగలవాడును, కాటుకకొండను బోలియున్నవాడును, మెరుపుయొక్క కాంతివలె వెలుగు ఆయుధములచే భయంకరమైనవాడును, ముప్పదిరెండు భుజ ములు కలవాడును, మూడు ఆమడల పొడవు కలవాడును, దిగుడు బావులవంటి నేత్రములు కలవాడును, కోరలచే భయం కరమైన ముఖము గలిగియున్నవాడును, అరుణనేత్రుడును, దీర్ఘనాసికుడునగు ఆ యమధర్మరాజును జూచి పాపాత్ములు మిగుల భయపడుదురు. చిత్రగుప్తుడును మరణవ్యాధాది సమేతుడై భీకరాకారుడై యముని చెంత నుండును. యముని వలెనే భీషణాకృతిగల దూతలు యముని సమీపముననున్న వారై హుంకరించుచుందురు. ఏ కాలమందును దానధర్మ ములు చేయని పాపాత్ముడు ఆ యమునిజూచి భయకంపితుడై హాహాకారములు సల్పుచుండును. ఆ ప్రకారముగ తమతమ పాపకర్మములను తలంచుకొని ఏడ్చుచుండు పాపాత్ములను

జూచి చిత్రగుప్తుడు యమునిచే నాజ్ఞాపింపబడి వారితో నిట్లు పలుకును—

1. భోభో పాపా దురాచారా అహంకార ప్రదూషితాః
కిమర్థమార్జితం పాపం యుష్మాభిరవివేకిభిః.
౨. కామక్రోధాద్యదుత్పన్నం సంగమేవ చ పాపినాం
తత్పాపం దుఃఖదం మూఢాః కిమర్థం చరితం జనాః.
౩. కృతవన్తః పురా యూయం పాపాన్యత్యన్తహర్షితాః
తథైవ యాతనా భోగ్యాః కిమిదానీం పరాఙ్ముఖాః.
4. కృతాని యాని పాపాని యుష్మాభిస్సుబహూన్యపి
తాని పాపాని దుఃఖస్య కారణంచ న వంచనాః
౫. మూర్ఖేఽపి పండితే వాపి దరిద్రేవా శ్రియాన్వితే
సబలే నిర్బలే వాపి సమవర్తీ యమస్మృతః

"ఓరి పాపాత్ములారా! దురాచారులారా! అహంకారాది దుర్గుణములచే దూషితులైనవారలారా! అవివేకులారా! ఏల మీరు పాపములను చేసితిరి? పాపాత్ములతో సహవాసము చేసి కామక్రోధవశవర్తులై నరకదుఃఖములను గలుగజేయు పాపములను మీరేల ఆచరించితిరి? వెనుక, మీరు చాల ఆనందముతో పాపములను చేసియుంటిరి, తత్ఫలితముల ననుభవింపబోవుచున్న ఈ సమయమున దుఃఖమున కేల వెఱచుచున్నారు? మీరుచేసిన పాపములే మీయీబాధలకు హేతువులుగాని మేము మిమ్మేమియు వచించుటలేదు. యముడు మూర్ఖులను, పండితులను, దరిద్రులను, ధనవంతులను, బలహీనులను, బలవంతులను ఒకేవిధముగ శిక్షించును;

కాని పక్షపాతము జూపడు"-చిత్రగుప్తుని యీవాక్యములను విని పాపులు తమ కర్మలను దలంచుకొని యేమిచేయుటకును లేక మారుమాట చెప్పక యూరకుందురు. అట్లు దొంగలవలె నిశ్చలులై యున్న ఆ పాపాత్ములను జూచి యముడు 'వారివారి పాపములకు తగిన దుఃఖముల ననుభవింపజేయుడు' అని భటుల కాజ్ఞ యొసంగును. అపుడు చండుడు, ప్రచండుడు మొదలగు యమదూతలు వారినందఱిని ఒక్కత్రాటిచే గట్టి వైచి నరకములకడకు గొనిపోవుదురు.

## యమలోక బాధలు

ఆ నరకములకడ నొక మహాశాల్మలివృక్షము (బూరుగుచెట్టు) కలదు; అది అగ్నిహోత్రమువలె వెలుగొందుచుండును. అది అయిదామడల విస్తీర్ణమును, ఒకామడ ఎత్తును గలిగియున్నది. యమభటులు పాపులనందఱిని ఆ చెట్టునకు తలక్రిందుగాగట్టి కొట్టుచుందురు. అచట వారిని రక్షించువారెవరును ఉండరు. ఎందఱో పాపులా బూరుగు చెట్టునకు కట్టబడి వ్రేలాడుచుందురు. ఆకలిదప్పులచే బాధ పడుచు వారు 'మమ్ము కాపాడు' అని చేతులు జోడించి ప్రార్థించుచుందురు. కాని వారి యీ వాక్యములను వినిపించుకొనక యమభటులు వారిని మరల ఇనుపచువ్వలచే మోదుచుందురు. అట్లు యమభటులచే కొట్టబడి చేష్టలుడిగియున్న పాపాత్ములనుజూచి భటు లిట్లు పలుకుదురు. ఓరీ దుర్మార్గులారా! మీరు పాపకర్మల నేలచేసితిరి? సులభతరములైన

జలదానము, అన్నదానము మున్నగువానినైనను ఒకప్పుడేని ఏలచేయకుంటిరి? కుక్కలకు, కోతులకు నాలుగు మెతుకలు కూడ ఏల వేయలేదు? వైశ్యదేవము, అతిథిపూజ, పితృ తర్పణము మొదలగు నిత్యనైమిత్తికాదిక్రియలను మీరు ఏలచేయలేదు? యముని యొక్కయు, చిత్రగుప్తునియొక్కయు మంత్రములు యమబాధలను తొలగించును. వానినైనను మీరు జపించరైతిరి. మీరు గృహస్థులైనను దేవపూజాది విద్యుక్తధర్మములను నెరవేర్చలేదు. తీర్థయాత్రలను సేవింప లేదు. సత్పురుషులను ఆరాధించలేదు. కావున మీరు చేసి కొనిన పాపములయొక్క ఫలములను అనుభవించకతప్పదు. మీరు ధర్మదూరులై యుండుటవలననే ఇపుడు మాచే కొట్టబడుచున్నారు.

క్షమాపరాధం కురుతే భగవాన్ హరిరీశ్వరః
వయంతు పాపరాధానాం దణ్డదా హి తదాజ్ఞయా.

భగవంతుడగు శ్రీహరి యొక్కడే మీ యపరాధములను క్షమింపగలవాడు. మే మాతని యాజ్ఞ మేరకు దండనము గావించువారమే అయియున్నాము. ఈప్రకారముగ పలు కుచు యమదూతలు చెట్టునకు వ్రేలాడగట్టబడిన ఆ పాపాత్ము లను మఱల మఱల కొట్టుచుండగా పాపులు చెట్టునుండి జారి క్రిందకు పడుచుందురు.

చెట్టునుండి క్రిందకు పడుచుండునపుడు వారిశరీరములు దానియాకులచే తెగిపోవుచుండును. క్రిందపడిన ఆ పాపులను కుక్కలు కఱచుచుండును. ఆ బాధలకు తట్టుకొనలేక వారేడ్చు

చుందురు. ఏడ్చుచుండు ఆ పాపాత్మునియొక్క నోళ్ళలో యమభటులు దుమ్ముగొట్టి వారిని త్రాళ్ళతో కట్టి కఱ్ఱలతో బాదుచుందురు. యమకింకరులు కొందఱు పాపులను అంపములతో కోయుచుందురు. కొందఱిని భూమిపై పరుండబెట్టి గొడ్డళ్ళతో ముక్కలు ముక్కలుగా నరుకుదురు. కొందఱిని నడుమువఱకు భూమిలో పాతిపెట్టి బాణములతో శిరస్సులను ఛేదించుచుందురు. కొందఱిని అగ్నిలోబెట్టి ఇనుమునవలె సమ్మెటలతో సాగగొట్టుచుందురు. కొందఱిని సలసలక్రాగు నీటియందును, నూనెయందును పడవైచి వేపుచుందురు. కొందఱిని కాళ్లు చేతులు కట్టివైచి జోరగిల పరుండబెట్టి ఏనుగులచేత త్రొక్కించుచుందురు.

కొందఱు పాపాత్ములను నూతులలో బడద్రోసెదరు. మఱికొందఱిని పర్వతశిఖరములనుండి క్రిందకు ద్రొళ్ళించుదురు. కొందఱిని పురుగుల గుంటలలో పడవేయుదురు. ఆ పురుగులు వారిని బహుభంగుల హింసించును. వజ్రపు ముక్కులుగల బొంతకాకులు పాపుల శిరస్సులమీాదను, కండ్లలోను, నోళ్ళయందును పొడిచి మాంసమును పెరికి తినుచుండును. అప్పుచేసియు దానిని తీర్చనట్టి మహాపాపులను ఋణమిచ్చినవారు "నాపైకము హరించి యెచటికి బోయెదవు? ఎక్కడ వెదకినను నీవు కనబడలేదు. యమలోకమున దాగికొంటివా?" అని గద్దించి పలుకుదురు. పాపాత్ముల శరీరములను యమకింకరులు ముక్కలు ముక్కలుగా ఛేదించి వేయుచుందురు. ఈ ప్రకారముగ యమాజ్ఞచే భటులు

వారిని కొట్టి, తిట్టి, పాశములతో గట్టివైచి బరబర యీడ్చు కొనిపోయి భయంకరమునగు తామిస్రాది నరకములలో పడవేయుదురు.

భయంకరమగు ఆ బూరుగుచెట్టు సమీపమున మహా దుఃఖదాయకములగు పెక్కు నరకములు గలవు. మొత్తము ఎనుబదినాలుగులక్షల నరకములు గలవు. వానిలో - తామిస్రము, లోహకుండము, మహారౌరవము, శాల్మలి, రౌరవము, కుడ్మలము, కాలసూత్రము, పూతిమృత్తిక, సంఘాతము, లోహితోదకము, సవిషము, సంప్రతాపనము, మహానిరయము, కాకోలము, సంజీవనము, మహాపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, సంప్రతాపనము, ప్రతాపనము-అను ఇరువదియొక్క మహానరకములు ముఖ్యములై యున్నవి. ఇవి గొప్ప బాధలకు స్థానములై వర్తించుచున్నవి. భయంకరులగు పెక్కురు యమకింకరులచే వ్యాపి సదా నిండియుండును.

ధర్మము నొకింతైనను జేయని మహాపాపులా ఘోర నరకములందుబడి కల్పాంతమువఱకును ఆయా నరకబాధల ననుభవించుచుందురు. పాపులిహలోకమున తమ తమ స్థూల శరీరములను వదలి నరకలోకమున ఆయా పాపములకు తగిన ఫలము ననుభవించుచుందురు. ప్రాణులకు ద్రోహముచేసి అన్యాయముగా సంపాదింపబడిన ధనముతో పోషింపబడిన ఈ స్థూలశరీరమును విడిచి పాపాత్ముడు పాపమే పాథేయము (దారిబత్తెము)గ గలవాడై ఒంటరిగ మహానరకములను

పొంది యచ్చోట తన పాపమునకు తగినఫలమగు దుఃఖమును అనుభవించును. అన్యాయార్జిత ద్రవ్యముచేతను అధర్మ మార్గములచేతను కుటుంబపోషణము గావించువాడు మహా దుఃఖప్రదమగు అంధతామిస్రనరకమును పొందును. ఇవ్విధముగ పాపి నరకముజేరి అచటి బాధలన్నిటిని అనుభవించి పాపము క్షయించిన వెనుక మరల భూలోకమున మానవుడై పుట్టును.

సదైవాకర్మనిరతా శ్శుభకర్మపరాఙ్ముఖాః
నరకాన్నరకం యాన్తి దుఃఖాద్దుఃఖం భయాద్భయమ్.

పాపకర్మలందే నిరంతరము ప్రీతిగలవారును, పుణ్యకర్మలందెన్నడును ఆసక్తిలేనివారును సద్గతిని బొందజాలరు. వారు ఒక నరకమునుండి మఱియొక నరకమునకు, ఒక దుఃఖమునుండి మఱియొక దుఃఖమునకు, ఒక భయమునుండి మఱియొక భయమునకు జనుచుందురు.

పాపాత్ములగువారు దక్షిణద్వారమునుండి యమపురమును ప్రవేశింతురు. అనేకవిధములగు క్లేశములకు నిలయమైన ఈ దక్షిణద్వారమునందే 'వైతరణి' నది కలదు. ఆ మార్గమున యమపురమునకు బోవు పాపాత్ములెవరనగా-

## పాపుల వివరము

హంతకులు, మద్యపాననిరతులు, స్త్రీలను హింసించువారు, గర్భపాతము చేసినవారు, పరుల ద్రవ్యమును అపహరించువారు. విశ్వాసఘాతకులు, అన్నములో విషము పెట్టి

ఇతరులను చంపువారు. దోషములను శ్లాఘించువారు, గుణములను నిందించువారు. గుణవంతులను పరిహసించువారు నీచులతో స్నేహము చేయువారు, సజ్జనసహవాసము చేయనివారు, పుణ్యతీర్థములను, సత్పురుషులను, సత్కర్మలను, గురువులను, దేవతలను నిందించువారు, వేదములను, శాస్త్రములను దూషించువారు. పరులకు సంతోషము కలిగిన దుఃఖించువారు, పరులకు దుఃఖము కలిగిన సంతోషించువారు, దుష్టవాక్యములను పలుకువారు, దుస్స్వభావము కలవారు, పెద్దల హితోపదేశములను వినవారు, శాస్త్రవాక్యములను మన్నింపనివారు, ఆత్మస్తుతి పరనిందాపరాయణులు, స్తబ్ధులు, పండితంమన్యులు; ధర్మము చేయనివారు, ఇంకను ఇట్టి వేయుగు పెక్కుపాపములను గావించువారు యమపురమున దక్షిణమార్గమునబడి రాత్రింబగళ్ళు ఏడ్చుచు పోయెదరు.

మఱియు తల్లిదండ్రులకు, గురువునకు, పూజ్యులకు అవమానము గలుగుజేయువారును, పతివ్రతయు, సాధుశీలయు, కులీనయు, వినయాన్వితయునగు భార్యను అకారణముగా ద్వేషమువలన విడుచువాడును, సజ్జనులపై దోషారోపణము చేయువారును, వారిని అవమానించువారును, దానమిచ్చెదనని చెప్పి ఇవ్వనివారును, ఇచ్చినదానిని మరల తీసుకొనువారును, ఇచ్చినపిదప 'అయ్యో' ఇచ్చివేసితిమే అని దుఃఖించువారును దానము చేయవద్దని దాతలకు బోధించువారును యజ్ఞములను ధ్వంసము చేయువారును. హరికథలకు విఘ్నములను కలిగించు

వారును. పరులక్షేత్రములను అపహరించువారును, వేదోక్త కర్మలను చేయనివారును, మాంసమును భుజించువారును, కల్లుత్రాగువారును. పరభార్యాపహారులును, పతివ్రతలను దూషించువారును, శాస్త్రనిషిద్ధకార్యముల నాచరించు వారును, ఇంకను ఇట్టివేయగు అనేక పాపకార్యములను చేయువారును వైతరణీనదియందు పడిపోవుదురు.

యమలోకమార్గమంతను దాటి యమపురమున ప్రవేశించిన ఆ పాపాత్ములను యముని ఆజ్ఞచే భటులు ఆ వైతరణీ నదియందు పడద్రోయుదురు గోదానము చేయని వారును, ఊర్ధ్వదైహికక్రియలు గావింపబడనివారును ఆ నది యందు పెక్కు యాతనల ననుభవించి దానియొడ్డుననున్న బూరుగుచెట్టు నాశ్రయించుకొని యుందురు. తప్పుడు సాక్ష్యములు పలుకువారును, ధర్మవిరుద్ధములగు కార్యములం దాసక్తిగలవారును. మోసముచేసి డబ్బుసంపాదించువారును, దొంగతనముచే జీవించువారును. ఫలవృక్షములను, పూల తోటలను నాశనము చేయువారును, వ్రతములనుగాని, తీర్థయాత్రలనుగాని చేయనివారును, స్త్రీలను హింసించువారును, భర్తను దూషించుచు పరపురుషునియందు మనంబుగల స్త్రీలును, ఇంకను ఈ విధములైన పాపములు చేయు వారును ఆ బూరుగుచెట్టునకు కట్టబడి యమకింకరులచే కొట్టబడుచుందురు.

ఇట్లు కొట్టుటచే క్రిందబడిన ఆ పాపాత్ములను యమ దూతలు మఱల నరకములందు పడద్రోయుదురు. నాస్తికులు,

మర్యాదను భంగము చేయువారు, పిసినిగొట్టువారు, విషయలోలురు, దాంభికులు-కృతఘ్నులు, నూతులు, చెఱువులు దిగుడు బావులు మున్నగువానిని పాడుచేయువారు, దేవాలయములను పడగొట్టువారును, కొంపలను కూల్చువారును, తల్లిదండ్రులకు, భార్యాబిడ్డలకు, సేవకులకు, గురువులకు పితృదేవతలకు పెట్టక తాము భుజించువారు, ముండ్లకంపలు, రాళ్లు మున్నగువానిచే మార్గములను పాడుచేయువారు శివుని, పార్వతిని, విష్ణువును, సూర్యుని, గణపతిని, సద్గురువులను, మహానీయులను పూజింపనివారు, దాసీసంభోగము, చేయువారు, పరస్త్రీలను ఆశ్రయించువారు ఈ ప్రకారము నరకమునందుబడి నానాయాతనలను బొందుచుందురు.

నాతియు కామాంధులు, విషములను విక్రయించువారు, అనాథులను రక్షింపనివారు, సజ్జనులతో విరోధము కల్పించుకొనువారు, నిరపరాధులను దండించువారు. (శక్తి కలిగియు) అన్నాతురులకు భోజనము పెట్టనివారు, భూతదయ లేనివారు, ఇతరులను వధించువారు, ఇంద్రియలోలత్వము గలవారు, మిత్రద్రోహులు, వివాహమును, తీర్థయాత్రను భగ్నమొనర్చువారు నరకములందు ఘోరదుఃఖము ననుభవింతురు.

ఇండ్లు, గ్రామములు, వనములు తగులబెట్టువారిని యమభటులు అగ్నిగుండములలో పడద్రోసి కాల్చి వేయుదురు. నీడకు గొనిపోండని వారు ప్రార్థించినప్పటికిని యమదూతలు వినక వారిని అసిపత్రవనమను నరకమునకు దీసికొని

పోవుదురు. అచట కత్తులవలెనుండు ఆకులచే శరీరములు ఛేదింపబడుచుండగా, ఏడ్చుచుండు పాపులనుజూచి యమభటులు 'ఈ అసిపత్రవృక్షముల నీడక్రింద కదురపోవుడు' అని చెప్పుదురు. ఆ పాపులు దాహము తీర్చుకొనుటకై మంచి నీళ్ళు ఈయవలసినదని కోరగా యమదూతలు సలసలకాగుచుండు నూనెనిచ్చెదరు. ఆకలి దప్పిలేక కర్మబంధముచే పాపులు ఆ నూనెత్రాగగా, ప్రేగులు మండుటచే క్రింద బడిపోయి ఏడ్చుచుందురు.

ఈ ప్రకారముగ పాపాత్ములు నరకలోకమునందు ప్రళయకాలమువఱకు నానాబాధ లనుభవించి తిరిగి అచ్చోటనే పుట్టుదురు. తదుపరి యమునియాజ్ఞచే భూలోకమునకు జని వృక్షలతాగుల్మపర్వతాదిరూపములను బొందుదురు. పిమ్మట క్రమముగ క్రిమికీటక పశుపక్ష్యాదులుగ పుట్టి తుదకు మనుష్యులై జన్మించుదురు. ఆ మనుష్యజన్మయందును పాప చిహ్నములు గలవారై కష్టరోగులుగను, పుట్టంధులుగను, మహారోగయుక్తులుగను జనించి నానాబాధలు పడుచుందురు.

## పాపములు - వాటికి తగిన శిక్షలు

ఓ గరుత్మంతుడా! ఏయే పాపములచే జనులు భూలోకమున ఏయే జన్మలనెత్తెదరో ఈ సందర్భమున తెలుపుచున్నాను, వినుము.

బ్రహ్మహత్య చేసినవాడు చండాలుడై పుట్టి క్షయరోగ మనుభవించును. గోహత్య చేసినవాడు చండాలురలో

మేకుగా జ్జుగా పుట్టును. కన్యకను చంపినవాడు చండాలుడై పుట్టి కష్టరోగ మనుభవించును. స్త్రీలను వధించినవాడు, గర్భపాతములు చేసినవాడు భిల్లుడై పుట్టి సదా వ్యాధులచే బాధింపబడుచుండును. స్త్రీలతో అక్రమసంబంధముగలవాడు నపుంసకుడగును. గురుభార్యతో గూడినవాడు చర్మవ్యాధిచే బాధపడును.

మాంసమును భుజించువాడు కుష్ఠరోగిగా పుట్టును. కల్లుత్రాగువాడు నల్లటిపండ్లు గలవాడగును. మంచి పదార్థములను ఇతరులకు పెట్టక తానొక్కడే భుజించువాడు గళగండ రోగమును పొందును. తినరాని వస్తువులను తినువాడు మహోదరజాడ్యము గలవాడగును. శ్రాద్ధమున మిలిన పదార్థములను పెట్టువాడు 'చిత్రకుష్ఠు'వనురోగముచే బాధితుడగును. గర్వముతో గూడినవాడై గురువు నవమానించువాడు అపస్మారరోగము కలవాడగును. వేదశాస్త్రములను దూషించువాడు పాండురోగియై పుట్టును. అబద్ధసాక్ష్యమును జెప్పువాడు మూగవాడై జనించును. పంక్తిభేదము చేయువాడు పెదవులులేనివాడై పుట్టును. పుస్తకములను దొంగలించువాడు పుట్టుగ్రుడ్డివాడగును. గోవులను, బ్రహ్మవిష్ణునను కాలితో తన్నువాడు కుంటివాడై పుట్టును. అబద్ధము చెప్పువాడు నత్తివాడగును. అబద్ధములను వినువాడు చెవిటివాడై పుట్టును. విషమిచ్చువాడు జడుడుగను, పిచ్చివాడుగను పుట్టును. ఇండ్లు మున్నగునవి తగులబెట్టువాడు వికారముఖుడు

శిరస్సు గలవాడగును. మాంసము నమ్మువాడు కురూపిగా పుట్టును. పరమాంసమును భుజించువాడు రోగగ్రస్తుడగును.

రత్నములను దొంగిలించువాడు హీనజాతులలో జన్మించును. బంగారమును హరించువాడు పిప్పిగోళ్ళు గల్గి పుట్టును. లోహములను అపహరించువాడు దరిద్రుడై పుట్టును. అన్నమును దొంగిలించువాడు ఎలుకయై పుట్టును. ధాన్యమును దొంగిలించువాడు మిడుతయై జన్మించును. నీళ్లు దొంగిలించువాడు చాతకపక్షియై పుట్టును. విషమును అపహరించువాడు తేలు అయి పుట్టును. పరిమళద్రవ్యములను హరించువాడు చుంచు అగును. తేనెను దొంగిలించువాడు దోమయై జన్మించును. మాంసమును అపహరించువాడు గ్రద్దయగును. ఉప్పు దొంగిలించువాడు చీమయై పుట్టును. ఫలమును, పుష్పములను తాంబూలమును హరించువాడు అరణ్యమున కోతియై జన్మించును. చెప్పులను గడ్డిని, పూరిని దొంగిలించువాడు మేకయై పుట్టును.

బాలవారలను దోచుకొనువాడును, వేటకాడును కటికవానియింట మేకలై పుట్టుదురు. విషము తిని చచ్చువాడు కొండమీద నల్లత్రాచు అయి పుట్టును. నిరంకుశ స్వభావముగలవాడు నిర్జనారణ్యమున ఏనుగయి పుట్టును. దేవతార్చనము చేయునట్టియు, భక్షింపరాని అనుచితపదార్థములను భక్షించునట్టియు జనులు మహారణ్యమున పెద్దపులులై పుట్టుదురు. గాయత్రిని జపించునట్టియు, సంధ్యావందనము నాచరించునట్టియు, పైకి సాధువేషము వేసి లోన దుష్టస్వభా

వము గల్గియున్నట్టియా జనులు కొంగలై పుట్టుదురు. గురువును ధిక్కరించి అవమానించువాడు నీరులేని మహారణ్యమున బ్రహ్మరాక్షసుడై పుట్టును.

మిత్రద్రోహి పర్వతముమీద గ్రద్దయై జన్మించును. అమ్మకమునందు మోసము చేయువాడు గుడ్లగూబయై పుట్టును. ఆశాభంగము చేసినవాడు చక్రవాకపక్షియై జనించును. తల్లిదండ్రులను, గురువులను, అక్కచెల్లెండ్రను, అన్నదమ్ములను ద్వేషించువాడు పెక్కుసార్లు గర్భమునందే మరణించును! అత్తమామలను బాధించునదియు, ప్రతిదినము కలహించుచుండునదియు నగు స్త్రీ జలగయై పుట్టును. భర్తను విడిచి పరపురుషుని గోరు ఆడుది బల్లియై పుట్టును. లేక రెండుతలల పాముగ జనించును. యౌవనవతి కాని బాలికతో క్రీడించువాడు అడవిలో కొండచిలువయై పుట్టును, గురుపత్నిని గోరువాడు తొండయై పుట్టును. అతికాముకుడై వర్తించువాడు గుఱ్ఱమగును.

మహాపాపములు చేసినవారు భయంకర నరకముల ననుభవించి ఆదుపరి ఈ భూలోకమున బుట్టుదురు. బ్రహ్మ హత్య చేసినవాడు గాడిద, లొట్టిపిట్ట, దున్నపోతు జన్మల నెత్తును. కల్లుత్రాగినవాడు తోడేళ్ళు, కుక్కలు, నక్కలు మొదలైన జన్మముల నెత్తును. బంగారమును హరించువాడు క్రిమికీట పక్షిజన్మల నొందును. పరభార్యను హరించువాడు,

దాచుమనియిచ్చిన వస్తువు నపహరించువాడు బ్రహ్మరాక్షసుడై పుట్టును.

పాపములు చేసినవారు నరకమున ఆయాదుఃఖముల ననుభవించి పాపశేషముతో మఱల పైన దెల్పిన జన్మముల నెత్తెదరు. భగవన్మాయచే మోహితులగు జనులు ఘటీయంత్రమువలె భూలోకమున కొన్నాళ్లును నరకలోకమున కొన్నాళ్లును కర్మపాశబద్ధులై తిరుగాడుచుందురు.

# గర్భనరకము

అంతట గరుత్మంతుడు విష్ణుభగవానుని ఇట్లు ప్రశ్నించెను- దేవా! నరకమునుండి వచ్చిన జీవులు తల్లిగర్భమున నెట్లు ప్రవేశించెదరు? వారెట్లు జన్మించెదరు? గర్భాదిదుఃఖముల నెట్లనుభవించెదరు? అంతయు సవిస్తరముగ తెలియజేయుడు-గరుత్మంతుని యీ వాక్యములనువిని విష్ణుభగవానుడిట్లు సమాధాన మొసంగెను-

జీవులు పురుషుని రేతఃకణము నాశ్రయించి పూర్వజన్మకర్మానుసారము దేహోత్పత్తికై స్త్రీల గర్భములందు ప్రవేశించుదురు. ఆ రేతఃకణము గర్భమున ప్రవేశించిన యొకదినమునకు 'కలల'మగును. ఐదు దినములకు బుద్బుదాకారమును బొందును. పది దినములకు కఠినమగు మాంసపు ముద్దయగును. ఒక నెలకు శిరస్సు ఏర్పడును. రెండు నెలలకు చేతులు మున్నగు అవయవములు ఏర్పడును. మూడు

నెలలకు గోళ్లు, వెంట్రుకలు, చర్మము, లింగము, నవరంధ్ర ములు ఉద్భవించును. నాలుగు నెలలకు సప్తధాతువులు అంకురించును. అయిదు నెలలకు ఆకలి, దప్పిక కలుగును. ఆఱు నెలలకు మావిచే కప్పబడి కడుపులో దక్షిణమున తిరుగుచుండును. ఈ ప్రకారముగ తల్లి భుజించిన అన్న పానాదులచే క్రమముగ వృద్ధిబొందుచు, దుర్గంధభూయిష్ట మగు మలమూత్రముల గుంటలో శయనించుచు అచ్చటి క్రిములు తన సుకుమారమైన శరీరమును కఱచుచుండ ఆ బాధకు తట్టుకొనలేక మరలమరల మూర్ఛచొందుచుండును.

అత్తటి మాతృభుక్తములగు కట్వామ్లలవణాది పదార్థ ములచే అవయవము లన్నిటియందును బాధగలుగుచుండ, మావిచేతను, ప్రేగులచేతను చుట్టబడి అధశ్శిరస్కుడై కదలుటకు మెసలుటకు కూడ శక్తిలేక పంజరమందలి పక్షి వలె తల్లిగర్భమున నుండును. అంతట దైవవశమునస్మృతి జనింప తానింతవఱకు తన పూర్వజన్మములందు చేసిన పాపములన్నియు జ్ఞప్తికిరాగా, దీర్ఘనిశ్వాసములను విడుచుచు పరితపించుచు చేతులు జోడించుకొని గద్గదస్వరముతో భగ వంతుని స్తోత్రము చేయుచుండును. ఏడవమాస ప్రారంభమున స్మృతిజ్ఞానము కలవాడై సూతికావాతములచే ఇటునటుకదల్చ బడుచు క్రిమివలె ఒకచోట నుండక కదలుచు జీవుడు భగ వానుని ఈ ప్రకారముగ స్తోత్రము చేయదొడగును—

"శ్రీపతియు, జగదాధారుడును, సమస్తపాపక్షయ కరుడును శరణాగతరక్షకుడును నగు శ్రీ మహావిష్ణువును

శరణుబొందుచున్నాను. దేవా! నీమాయచే మోహితుడనై పుత్రమిత్రకళత్రాదులందు అహంకార మమకారములు గలిగి సంసారమున పడిపోయితిని.

కృతం పరిజనస్యార్థే మయా కర్మ శుభాశుభమ్
ఏకాకీ తేన దగ్ధోఽహం గతాస్తే ఫలభాగినః.

భార్యాపుత్రాదిపరిజనులకొఱకై, వారి పోషణాదులకొఱకై నేనెన్నియో అశుభకర్మల నాచరించితిని. కాని ఫలకాలము వచ్చినపుడు నేనొక్కడనే ఆ యా కర్మఫలములచే దహింప బడుచున్నాను. వారో, నెమ్మదిగ దాటుకొనిపోయిరి.

పరాత్పరా! ఈ గర్భకుహరమున నానాబాధలనొందు చున్నాను. దన్నిటనుండి బయటకు పడద్రోయుము. అట్లు చేసినచో నీ చరణకమలములనే ఎల్లపుడు స్మరించుచు మోక్షమునకు వలసిన సాధనోపాయములను వెంటనే అన్వే షించెదను. ముక్తిమార్గమును వెదకికొందును. శ్రీహరీ! ఈ మలమూత్రకూపమునబడి జఠరాగ్నిచే దగ్ధమై పోవు చున్నాను. ఇచ్చోటనుండి ఎట్లైనను నన్ను బయటకు త్రోసి వేయుటకు అనుగ్రహింపుము. ఇట్టి జ్ఞానము ఎవరి యనుగ్రహమువలన కలిగినదో అట్టి పరమేశ్వరుడవగు నిన్ను శరణుబొందుచున్నాను. దీనదయాళూ! శరణాగతవత్సలా! ఆర్తత్రాణపరాయణా! నాకు మఱల ఈ సంసార చెప్పటికిని లేకుండ జేయుము!”

ఈ ప్రకారముగ స్తోత్రముచేయు ఆ జీవుని పదవ మాసమున ప్రసవహేతువగు వాయువు అవాఙ్ముఖముగ చిమ్మగా నతశిరస్కుడై స్మృతిని గోల్పోయి అతికష్టము మీద బయటకువచ్చును. భూమిమీదపడి మలమూత్రము లందు క్రిమివలె దొర్లాడుచుండును. అపుడు జ్ఞానము నశించి అజ్ఞానమావరింప ఏడ్వదొడంగును.

గర్భే వ్యాధౌ శ్మశానే చ పురాణే యా మతిర్భవేత్
సా యది స్థిరతాం యాతికో న ముచ్యేత బన్ధనాత్.

తల్లిగర్భమునందున్నప్పుడు, వ్యాధివచ్చినపుడును, శ్మశానమునందున్నపుడును, పురాణము వినునప్పుడును, ఎట్టి జ్ఞానము కలుగునో, అట్టిజ్ఞానము ఎల్లపుడును ఉండుచో ఇక బంధనమునుండి ఎవడు విడివడడు! కాని ఆ జ్ఞానము జనులకు స్థిరముగా నిలుచుట లేదు.

గర్భగోళమునుండి బయటకు వచ్చిన వెంటనే వైష్ణవీ మాయ జీవుని కప్పివేయుచున్నది. అట్లు మాయాచ్ఛాదితుడై ఏమియు పలుకలేక పరాధీనుడై శైశవదుఃఖములచే నానా బాధలు పొందుచుండును. నల్లులు, చీమలు మున్నగు వానిచే కఱువబడుచు, గోకుకొనుటకైనను వీలులేక చెప్పుటకు ఎన్నియో యాతనల ననుభవించుచు ఏడ్చుచుండును.

ఈ ప్రకారముగ బాల్యకాలదుఃఖముల ననుభవించిన పిమ్మట యౌవనకాలదుఃఖములను జీవుడెదుర్కొనును.

యౌవనమున మనుజుడు ఆసురీసంపద నాశ్రయించి, దుర్వా
సనా, దుస్సంస్కారయుతుడై నీచసంగ పరాయణుడై, శాస్త్ర
ములను, సత్పురుషులను ద్వేషించుచు, కామలంపటుడై, అగ్ని
యందు మిడుతపడునట్లు కామాగ్నికి ఆహుతియగుచున్నాడు.

కురఙ్గ మాతఙ్గ పతంగ భృంగ
మీనా హతాః పంచభిరేవ పంచ
ఏకః ప్రమాదీ స కథం న హన్యతే
యస్సేవతే పంచభిరేవ పంచ,

లేడి శ్రోత్రేంద్రియమునకును, ఏనుగు త్వగింద్రియమునకును, మిడుత నేత్రేంద్రియమునకును, చేప జిహ్వేంద్రియమునకును, తుమ్మెద ఘ్రాణేంద్రియమునకును లోబడి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములచే క్రమముగ నాకర్షింపబడి చనిపోవుచున్నవి. ఈ ప్రకారముగ ఒక్కొక్క ఇంద్రియమునకు దాసులై, ఆ ఇంద్రియార్థమును సేవించుటవలన ఒక్కొక్క జంతువు చనిపోవుచుండ, ఇక అన్ని ఇంద్రియములకును దాసానుదాసుడై యున్న మానవునిగతి యేమగును? అతడేల వినాశమొందకుండును?

ఈ ప్రకారముగ యౌవనకాలమున జీవుడు విషయతత్పరుడై అతిదుర్లభమగు మానవజన్మమును వ్యర్థముగ గడపివేయుచున్నాడు. అట్టివానికంటె మూఢుడు మఱియొకడుండునా? స్వహస్తమందలి అమృతమును ఆతడు జారవిడుచుకొనినవాడే యగును. యౌవనము దాటిన తదుపరి జీవుడు వార్థక్యమును బొంది అనేకరోగములచే బాధపడుచు

మృతినొంది మహాదుఃఖదాయకములగు నరకములను మరల పోవుదురు. ఈ ప్రకారముగ పాపాత్ములు రాకడపోకడలు కలవారై కర్మబద్ధులై, మాయావిమోహితులై, వైరాగ్యమును బడయక సంసారసముద్రమునబడి దరిగానక నానా యాతనల ననుభవించుచుందురు.

## యమబాధానివారణ

అంతట గరుత్మంతుడు విష్ణుభగవానుని ఇట్లు ప్రశ్నించెను—"మహాత్మా! ఇంతవరకు యమలోకమున జీవుడనుభవించు బాధలను గూర్చి వింటిని. ఇక జీవులు ఆ యమబాధలను తప్పించుకొనుట ఉపాయము లేవి? మఱియు, సంసారసాగరనిమగ్నులును, దీనచిత్తులును, పాపాత్ములును, విషయసుఖాసక్తులునగు మనుజు లేవిధముగ సద్గతిని బొందుదురు? దయచేసి తెలియజేయుడు. ఆ ప్రార్థన విని విష్ణుభగవాను డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను—ఓ గరుత్మంతుడా! భగవదాశ్రయమే జీవునకు తరణోపాయమని యెఱుగుము, మనుజుడు భక్తితోగూడి గంధపుష్పాదులచేతను, తులసీ బిల్వాదిపత్రములచేతను భగవంతుని పూజించి అష్టాక్షరీ మహామంత్రము (ఓమ్ నమోనారాయణాయ)ను గాని, లేక ద్వాదశాక్షరీ మహామంత్రము (ఓమ్ నమోభగవతే వాసుదేవాయ)నుగాని, లేక ఏదైన దివ్యమంత్రమునుగాని జపించవలెను. శివకేశవుల నామములు వినినను, స్మరించినను మను

జాల సమస్త పాపములు తొలగిపోవును. హరినామస్మరణము చే పాపము విధ్వంసమైపోవును.1

మనుజుడు రోగగ్రస్తుడై యున్నపుడు రోగియొద్ద కూర్చుండి బంధువులు ఏడవగూడదు. పవిత్రమగు నా నామమును (భగవన్నామమును) సంస్మరించుచుండవలెను.

మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, రామ, పరశురామ, కృష్ణ, బుద్ధ, కల్కి2 అను నాయొక్క దశావతార నామములను విజ్ఞులు సదా స్మరింపవలయును. రోగియొద్ద ఇట్టి పవిత్రములగు నా నామములను, సంకీర్తన గావించువారే వాస్తవముగ బంధువులనబడుదురు.3 'కృష్ణ' యను మంగళకరమైన నామ మెవని నోటినుండి వెలువడునో ఆతని సమస్త పాపములు భస్మమైపోవును.4

మహాపాపాత్ముడగు అజామిళుడు అవసానకాలమున 'నారాయణ' అని తన పుత్రుని పిలుచుటవలన తన్నామ

---

1. సంస్మరేచ్ఛృణుయాచ్చైవ విష్ణోర్నామ శివస్యచ
   హరేర్నామ హరేత్పాపం నృణాం శ్రవణగోచరమ్.
2. మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః
   రామో రామశ్చ కృష్ణశ్చ బుధః కల్కిత దైవత.
3. ఏతాని దశనామాని స్మర్తవ్యాని సదా బుధైః
   సమీపే రోగిణో బ్రూయుర్బాంధవాస్తే ప్రకీర్తితాః
4. కృష్ణేతి మంగళం నామ యస్య వాచి ప్రవర్తతే
   తస్య భస్మీభవన్త్యాశు మహాపాతకకోటయః.

మాహాత్మ్యమువలన సద్గతిని బడయుగలిగినపుడు ఇక శ్రద్ధాభక్తులతో శ్రీహరిని స్మరించువారికి మోక్షము గలుగునని వేఱుగ చెప్పనేల? నన్ను స్మరించినవారు దుర్మార్గులైనను నేను వారి పాపములన్నిటిని క్షమింపజేయుదును. తెలియక తొక్కినను అగ్ని కాల్చివేయును గదా. మఱియు ఓ గరుత్మంతుడా! పాపమును తొలగించుటలో[1] హరినామమునకు గల శక్తి 'ఇంత' యని చెప్పుటకు వీలుపడదు.[2] యముడు తన కింకరులను 'నాస్తికుల నా లోకమునకు తీసికొనిరండు; హరినామస్మరణ చేయువానిని మాత్రము తీసికొనిరావలదు' అని యాజ్ఞాపించును.[3]

"అచ్యుతా! కేశవా! రామా! నారాయణా! కృష్ణా! దామోదరా! వాసుదేవా! హరీ! శ్రీధరా! మాధవా! గోపికావల్లభా! జానకీనాయకా! రామచంద్రా! కమలనేత్రా! విష్ణూ! భూధరా! గోవిందా! శంఖచక్రపాణీ"—అని ఈ ప్రకారముగ హరినామస్మరణ జేయుచు రక్షింపుమని వేడుచు శ్రీహరి నెల్లపుడును భజనచేయు పుణ్యాత్ములను దూరముగా నుండియైనను చూడకుడు. వారిని

---

1. హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః
అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యేవహి పావకః
2. హరేర్నామ్నశ్చ యా శక్తిః పాపనిర్హరణే ద్విజ
తావత్కర్తుం న సమర్థో వ పాతకం పాతకీ జనః.
3. కంకరేభ్యో యమః ప్రాహానయధ్వం నాస్తికం జనం
నైవానయత భో దూతాః హరినామస్మరన్నరమ్.

నా లోకమునకు తీసికొనివచ్చుటకు ప్రయత్నింపకుడు!'' అని యమధర్మరాజు తన దూతల కాజ్ఞ యొసంగును.

'ముకుందుని పాదారవిందములను ధ్యానముచేయని పాపాత్ములను నాలోకమునకు తప్పక తీసికొనిరండు. మఱియు ఏవిధమగు పుణ్యములను ఆచరింపనివారిని, విషయచింతనమున ఆసక్తి గలిగియున్న వారిని నాకడకు గొనిరండు. ఎవని జిహ్వా భగవంతుని గుణగణములను గానముచేయదో, ఎవని చిత్తము భగవంతుని చరణారవిందములను స్మరింపదో, ఎవని శిరస్సు శ్రీకృష్ణునకు ఒక్క పర్యాయమైనను నమస్కరింపదో అట్టి దుర్మార్గులను నాలోకమునకు పట్టితీసికొనిరండు!'- అని యముడు తన కింకరులను ఆజ్ఞాపించును.*

కాబట్టి మహాపాపములకును విరుగుడై జగన్మంగళకరమైనట్టి విష్ణునామస్మరణమును జీవుడు తప్పక గావింపవలెను. నారాయణపరాఙ్ముఖుడైనవానిని ప్రాయశ్చిత్తములు సైతము పవిత్రునిగ చేయజాలవు. నదులన్నియు కలిసియు కల్లుకుండను పవిత్ర మొనర్పజాలవు కదా! కృష్ణనామోచ్చారణమువలన పాపరహితులైన మహాపుణ్యాత్ములు యమకింకరులను చూడరు. 'నందనందనా' (శ్రీకృష్ణా) యని పలుకువాడు వైతరణీనదియందు పడడు. కాబట్టి ఘోరపాప

---

* జిహ్వా నవక్తి భగవద్గుణనామ ధేయం
చేతశ్చ నస్మరతి తచ్చరణారవిందం
కృష్ణాయ నో నమతి యచ్చిర ఏకదాపి
తానానయధ్వమసతోఽకృతవిష్ణుకృత్యాన్

ములను గూడ నశింపజేయునట్టి భగవన్నామమును స్మరింప
వలెను. భగవద్గీతా పారాయణమును, విష్ణుసహస్రనామ
పారాయణమును చేయవలెను. లేక వానిఁగూర్చిన శ్రవణ
మైనను గావింపవలెను. ఏకాదశీవ్రతము, భగవద్గీత, గంగో
దకము, తులసీదళము, విష్ణుపాదోదకము, విష్ణునామము—
వీనిని సేవించువానికి ముక్తి లభించును. మఱియు అన్న
దానము మొదలైనవి కావించువానికి; దానధర్మముల
నొనర్చువానికి యమలోక దుఃఖములు కలుగవు.

తిలదానము, లోహదానము, హిరణ్య(స్వర్ణ)దానము,
కార్పాస(వస్త్ర)దానము, లవణదానము, సప్తధాన్యదానము,
భూదానము, గోదానము, అను అష్టమహాదానములు మహా
పాపవినాశకరములైనవి. పుణ్యప్రదములైనవి. వాని నాచ
రింపవలయును. ఈ ప్రకారముగ దానధర్మపరాయణుడై
భగవద్భక్తి సంయుతుడై భగవన్నామోచ్చారణపరుడై
యుండు మనుజుడు యమలోకదుఃఖములను బొందకుండుటయే
కాక అచిరకాలములో మోక్షభాగియు కాగలడు.

అంతట గరుత్మంతుడు విష్ణుభగవానుని ఇట్లు
ప్రశ్నించెను- "దేవదేవ! శరణాగతవత్సలా! దుఃఖపూరి
తమును, అపారమునగు ఈ ఘోరసంసారమున జీవరాసులు
పలువిధములగు శరీరములను ధరించి పుట్టుచు గిట్టుచు
న్నారు. వారి యీ జన్మలకు అంతము గానవచ్చుటలేదు.
వారు సదా దుఃఖించుచునే యున్నారు. ఏ యుపాయముచే
వారు మోక్షమును పొందుదురో దయతో తెలుపుము."

ఇట్లు గరుత్మంతుడు అడుగఁగా విష్ణుభగవానుఁ డిట్లు చెప్పఁదొడగెను:—

గరుడుఁడా! దేనిని తెలుపుమని నీవు నన్నడుగు చున్నావో, దేనిని విన్నంత మాత్రముననే నరుడు సంసార బంధమునుండి విముక్తుడు కాగలఁడో దానిని చెప్పెదను వినుము:—పరబ్రహ్మస్వరూపియగు పరమాత్మ కలఁడుగదా? ఆతడు సర్వజ్ఞుడు, సర్వకర్త, సర్వేశ్వరుడు, నిర్మలుడు, అద్వితీయుడు, నిర్గుణుడు, సచ్చిదానందుడు, స్వయంజ్యోతి, ఆది మధ్యాంతరహితుడు, నిర్వికారుడు, పరముకంటెను పరుడు. ఆతనినుండి అగ్నినుండి విస్ఫులింగములవలె జీవు లుద్భవించి దేహాద్యుపాధులచే భిన్నులై సుఖదుఃఖప్రదములును పుణ్యపాపరూపములు నగు అనాదికర్మలచే నియంత్రితులై ఆయా కర్మలకు తగిన శరీరములను, ఆయుస్సును, భోగభాగ్యాదికమును పొందుచున్నారు.

బంధభూతమగు కర్మ మిగిలియున్నచో జీవులు ఆయా జన్మములను మరల మరల పొందుచునే యుందురు. వారు ముందుగా స్థావరము లగుదురు. పిదప పురుగులు అగుదురు. ఆ పిమ్మట పక్షులును, అనంతరము పశువులు నగుదురు. పిమ్మట నరులు, అందును ధార్మికులునై తదుపరి మోక్షమును పొందుదురు. వేలకొలది చతుర్విధశరీరములను ధరించి వానిని విడిచి సుకృతమువలన మానవుడై జ్ఞానవంతుడయినచో మోక్షమును పొందును. ఎనుబదినాలుగులక్షల శరీరముల యందును జీవులకు మనుష్యజన్మమున తప్ప ఇతర జన్మలలో

తత్త్వజ్ఞానము లభింపదు. ఈ ఎనుబదినాలుగులక్షల జన్మములలో పుణ్యసంచయమువలనగాని మనుష్యజన్మ లభింపదు. మోక్షమునకు సోపానభూతమును, దుర్లభమునగు మనుష్యజన్మమును పొందియు, ఎవడు ఆత్మకు తరణోపాయము జూచుకొనడో ఆతనికంటె పాపి మఱి యెవడుండును?

ఉత్తమమగు నరజన్మము కలిగియు, దృఢశరీరియునై ఎవడు ఆత్మహితమును చూచుకొనడో అతడు బ్రహ్మహంతకుడని యనిపించుకొనును. దేహము లేనిదే యెవడును పురుషార్థములను సాధించుకొనజాలడు. కావున దేహమును, ధనమును రక్షించుకొని పుణ్యకర్మలను సాధింపవలెను. ఆత్మయే అన్నిటికిని ఆధారము. కావున దానిని శ్రద్ధతో రక్షింపవలెను. ఆత్మరక్షణమున నెప్పుడును మహోత్సాహియై యుండవలెను గ్రామము పోయినచో మరల సంపాదింపవచ్చును. ధాన్యములు పోయినచో మరల రావచ్చును. ధనముపోయినను, ఇల్లుపోయినను మఱల సంపాదింపవచ్చును. కాని మానవశరీరము పోయినచో మరల దానిని పొందుట మహాదుస్తరము. శరీరము ధర్మమే ప్రయోజనముగాఁగలది. ధర్మము జ్ఞానార్థము, జ్ఞానము ధ్యానయోగార్థము వినియోగింపబడును, ధ్యానయోగి శీఘ్రముగా మోక్షమును పడయును. ఈ ప్రకారముగ ఎవడు అహితమునుండి తన్ను తాను రక్షించుకొనునో, అతడు తరించిపోవును. అట్లు రక్షించుకొననివానిని మఱి ఎవడు రక్షించును? ఎవడు తరింపజేయును?

నరకమను వ్యాధికి ఇక్కడనే (ఈ భూలోకముననే, మానవజన్మయందే) యెవడు చికిత్స చేసికొనడో, ఔషధములు లేని ఇతరలోకములకుబోయి ఆరోగి యేమి చేయగలడు? కావున మానవజన్మయందే తరణోపాయమును వెతకికొన వలయును. ముసలితనము పెద్దపులివలె నెదుట కాచికొని యున్నది పగిలిపోయినకుండలోని నీటివలె నాయుర్దాయము గడచిపోవుచున్నది. రోగములు శత్రువులవలె బాధించు చున్నవి. కాబట్టి శ్రేయమును చూచుకొనవలెను. ఎంత వఱకు దుఃఖములు సంప్రాప్తములుకావో, ఎంతవఱకు ఆప దలురావో, ఎంతవఱకు ఇంద్రియవికలత్వము కలుగదో అంత వఱకును శ్రేయస్సును చూచుకొనవలెను. (మోక్షప్రయ త్నము గావింపవలెను) ఈ దేహము ఎంతవఱకు ఉండునో అంతవఱకును తత్త్వజ్ఞానమును గడించుకొనవలెను. ఇంటి ముంగిలి నిప్పంటుకొనిన తర్వాత (జలార్థము) నూయి త్రవ్వు వాడు మూఢుడుగదా? కావున ఆయుర్దాయము సమసిపోక పూర్వమే సంసారతరణోపాయములను అన్వేషింపవలెను. సాంసారికములగు అనేక జటిల ప్రవృత్తులలో, వ్యవహారము లలో మునిగిపోవుటవలన జనులచే కాలము ఎఱుగబడుట లేదు. సుఖదుఃఖముల నెఱింగి అనుభవించియు, మోక్షోపాయ మిదియని తెలిసియు జనుడు తనహితమును చూచుకొనుట లేదు. ఆర్తులయినవారిని, మరణించినవారిని, ఆపద్గ్రస్తులను దుఃఖితులను జూచియు ఈ జనులు మోహము అను కల్లు త్రావి (మత్తుపొందుటవలన) ఎప్పుడును భయపడుట లేదు.

ఆయుర్దాయము మెఱుపువలె క్షణమాత్రము. సంపదలు కల లోని ముచ్చటలు. యౌవనము పుష్పమువలె క్షణికమైనది. ఈ సత్యమును తెలిసికొనినచో ఇక జీవితమునం దెవనికి ఆశ్వాసముండును? ఆయుర్దాయము నూరేండ్లని అనుకొనినను అది అల్పమేయగును. అందును నిద్రయందు సగముకాలము గడచిపోవును. బాల్యము, రోగములు, ముసలితనము, దుఃఖ ములు-వీనివలన మఱింత కాలము గడచిపోగా ఇక మిగులు నది అత్యల్పము. దానినికూడా మనుజుడు నిష్ఫలమొనర్చు చున్నాడు. ప్రారంభింపదగిన మోక్షోపాయమున నిరుద్యో గుడై యుండుచున్నాడు. మేలుకొనియుండదగిన బ్రహ్మ చింతనమున నిద్రాళువై యున్నాడు. భయస్థానమగు సంసార మును నమ్మియున్నాడు. ఆహా! ఇట్లుండినచో ఇక ఏ నరుడు యమునిచే హతుడు కాకుండును? కాబట్టి మోక్షోపాయము లగు నిష్కామకర్మ, భక్తి, వైరాగ్య, ధ్యాన, జ్ఞానాదులను జీవుడు సత్వరమే ఆశ్రయించి యమలోక బాధను తప్పించు కొనవలెను.

తరంగములమీద గల నురుగుతో సమానమైనదియు అనిత్యమునగు ఈ శరీరమును నమ్ముకొని జీవుడు నిర్భయుడై యెట్లుండగలడు? అజ్ఞానియగు జీవుడు అహితమును హితమను కొని, ధ్రువముకానిదానిని ధ్రువమనుకొనుచు అనర్థమును సార్థకమనుకొనుచున్నాడు. తనగతినిగూర్చి ఆతడు ఊహించు కొనుటయే లేదు. అట్టివాడు దేవమాయావిమోహితుడై చూచుచునుగూడ చూడలేకున్నాడు; వినుచునుగూడ బోధ

పఱిచుకొన లేకున్నాడు. చదువుచునుగూడ తెలిసికొనలేక పోవుచున్నాడు. మృత్యువు, రోగములు, వార్ధక్యము మొదలగు మొసళ్ళచే కరవబడుచు భయంకరమైన కాలసాగరమున కొట్టుకొనిపోవుచు కూడా ఆ సంగతి నెఱుగకున్నాడు.

పచ్చికుండ నీటిలో కరిగిపోవునట్లు కాలము క్షణ క్షణము నశించిపోవుచున్నది. దీని నెవడును గమనించుట లేదు. వాయువును అరికట్టవచ్చును. ఆకాశమును ఖండింపవచ్చును. తరంగములను ప్రోగుచేయవచ్చును. కాని ఆయుర్దాయమును మాత్రము స్థిరముగా నిలుపుటకే యుపాయమును లేదు.

(ప్రళయ కాలమున) భూమి తగులబడిపోవుచున్నది. మేరువు కరిగిపోవుచున్నది. సముద్ర మింకిపోవుచున్నది. ఇక శరీరము సంగతి చెప్పనేల? 'వీడు నాకుమారుడు. ఈమె నా భార్య. ఇది నా ధనము. వీరు నా బంధువులు'— అని ఈ ప్రకారముగ అఱచుచుండు మనుష్యుడను మేకను కాలమను తోడేలు బలవంతముగ పట్టుకొనుచున్నది. 'ఇది చేయబడినది, ఇది యింకను చేయవలెను, వాడది చేసెను, దాని నింకను చేయలేదు'— అని యిట్లు యోచించుకొనుచుండు వానిని యముడు తనవశము చేసికొనుచున్నాడు. కాబట్టి—

శ్వః కార్య మద్య కుర్వీత పూర్వాహ్ణే చాపరాహ్ణికం
న హి మృత్యుః ప్రతీక్షేత కృతం వా వ్యథవాఽకృతమ్.

రేపు చేయవలసినదానిని నేడే చేయవలెను. మధ్యాహ్నము చేయవలసినదానిని ప్రొద్దుననే చేయవలెను.

చేసినను చేయకున్నను మృత్యువు మాత్రము వేచియుండదు. (అమాంతముగ ఆతనిని కబళించి వేయగలదు.)

ముసలితనము మార్గము చూపుచుండ, ప్రచండమగు వ్యాధియను సైనికుడు ఆక్రమించియుండ, మృత్యువను శత్రువు నిన్ను పట్టుకొనియుండ ఇక కాపాడువానిని గూర్చి యేల ప్రయత్నించుట లేదు ! తృష్ణయను గంటములతో గ్రుచ్చి విషయములను నేతిలో రాగద్వేషములను అగ్నిమీద వ్రేల్చబడిన మానవుడను మాంసపుముద్దను మరణము భక్షించి వేయుచున్నది. బాలురను, యౌవనులను, వృద్ధులను, తుదకు గర్భవతులనుగూడ మృత్యువు ఆక్రమించి వేయుచున్నది. జగత్తుయొక్క స్థితి ఇది. జీవుడు చిరకాలము తాను ప్రేమించి లాలించిన తన దేహమునుగూడ విడిచి యమగృహమునకు బోవుచున్నాడు. ఇక భార్య, తల్లి, తండ్రి, బిడ్డలు మున్నగువారిని గుఱించి వేఱుగ చెప్పనేల ?

అజ్ఞానమే (తన్ను తా నెఱుంగకుండుటయే) సంసార దుఃఖములన్నిటికిని మూలము. అది లేనివాడు సుఖవంతుడు. అట్టివాడే యమబాధలను తప్పించుకొనును. దృశ్యపదార్థములపై ఆసక్తి తొలగనివాడు, మమత్వముచే వానియందు తగుల్కొనువాడు శాంతిని, సుఖమును ఎన్నటికిని నోచుకొనలేడు. మనుజుడు మనఃప్రియములగు విషయాదులందు ఎంతెంత సంబంధము కలుగజేసికొనుచుండునో, అంతంత దుఃఖము వాని హృదయమును వేధించుచుండును. విషయములను ఆహారమును భుజించుచు ఇంద్రియములను దొంగలు

మనుజుని దేహమందే కాపురము చేయుచు అతని జ్ఞానధన మును అపహరించి వేయుచున్నారు.

మాంసలుబ్ధో యథా మత్స్యో లోహశంకుం న పశ్యతి
సుఖలుబ్ధ స్తథా దేహీ యమబాధాం న పశ్యతి.

'మాంసము నపేక్షించు మత్స్యము గాలము నెట్లు చూడదో విషయసుఖము నపేక్షించు జీవుడు యమబాధను చూడజాలకున్నాడు. కాబట్టి మనుజుడు జాగరూకుడై, జీవిత మున ఒక్కక్షణమైనను వ్యర్థపఱుపక, భక్తి జ్ఞాన వైరాగ్య ములను జేపట్టి, అనిత్యములగు దృశ్యపదార్థములపై ఆసక్తి నుంచక, శాశ్వత బ్రహ్మపదార్థమునుగూర్చియే చింతించుచు జీవితమును సార్థకము చేసికొనవలయును. ఈ ప్రకారముగ పారమార్థిక ధనమును, దైవసంపదను యత్నపూర్వకముగ సంపాదించుకొనువాడు యమలోక బాధ నెన్నటికిని బడయ కుండును. ఈ జీవితమునందే పరమానందరూప కైవల్యప్రాప్తి నొందును.

## దుఃఖ నివారణోపాయము

ఓ వైనతేయా! దృశ్యరూపమగు ఈ సంసారము యొక్క భావనయే దుఃఖమునకు మూలము. అట్టి భావము త్యజించువాడు పరమసుఖవంతుడు. ప్రాపంచిక పదార్థములు, బంధ్వాదులు మున్నగునవి కేవలము శృంఖలములే యగును. దానివలన జీవునకు ముక్తి కలుగనేరదు. మనుజుడు ప్రపంచ

మున మనఃప్రియములగు సంబంధముల నెన్నింటిని చేయునో, అన్ని దుఃఖములచే నాతడు కొట్టబడుచుండును.

మంచియు చెడ్డయు తెలుంగక ఎప్పుడును తప్పుదారినే పోవుచు కేవలము తమ ఉదరములను నింపుకొనుటకే చూచుచుండు నరులు నరకమునకు పోవుదురు. నిద్ర, మైథునము, ఆహారము మున్నగునవి ప్రాణికోటికంతకును సమానమే. జ్ఞానముకలవాడే మానవుడు. అది లేనివాడు ద్విపాదపశువు. మూఢులు ప్రాతఃకాలమునందు మలమూత్రములవలనను, మధ్యాహ్నమున ఆకలిదప్పికలవలనను, రాత్రి మదన తాప, నిద్రలవలనను బాధింపబడుచున్నారు. అజ్ఞాన మోహితులై తమ దేహమని, తమ సంపదలని, తమ బంధువులని అహామికను బొంది తత్ఫలితముగ ప్రాణులు పుట్టుచు గిట్టుచున్నారు. కాబట్టి సంగమును (attachment) విడువవలయును. అద్దానిని మొదటనే విడుచుట కష్టము. కావున పెద్దల సాంగత్యమును చేయవలెను.

సత్సంగశ్చ వివేకశ్చ నిర్మలం నయనద్వయమ్
యస్య నాస్తి నరస్సోంధః కథం నస్యాదమార్గగః.

సత్సాంగత్యము, ఆత్మానాత్మ వివేకము - అను ఈ రెండును నిర్మలములగు రెండు నేత్రములవంటివి. అవి లేనివాడు అంధుడే యగును. అట్టివాడు తప్పుదారిని పడిపోయి నశించును. కావున మనుజుడు జాగరూకుడై ఆ రెండిటిని తప్పక సంపాదించవలెను.

దాంబికులు కొందఱు పరమార్థతత్త్వము నెఱుగక నామమాత్రముగ క్రియలను జేయుచు లోకవంచనము గావించుచున్నారు, అట్టివారు మోక్షము నెన్నటికిని బడయజాలరు. కొందఱు శరీరమును మాత్రము శుష్కింపజేయుచు తాము గొప్పకార్యమును సాధించితిమని తలంచుచున్నారు. పుట్టను బాదినంతమాత్రమున లోపలనున్న పాముచచ్చునా! మఱికొందఱు జడలు తోళ్లు మున్నగువానిని ధరించి జ్ఞానులమని చెప్పుకొనుచు లోకులను భ్రమింపచేయుచున్నారు. సంసారసుఖములందు తగుల్కొని పైకిమాత్రము వేషములు వేసికొని తాను బ్రహ్మజ్ఞానము కలవాడని చెప్పుకొనుచు తిరుగువాడు కర్మబ్రహ్మల రెండిటికిని చెడినవాడే యగును. కావున అట్టివానిని నమ్మరాదు. అదియంతయు లోకవిడంబనమే కాగలదు.

మోక్షస్య కారణం సాక్షాత్తత్త్వజ్ఞానం ఖగేశ్వర

మోక్షకారణము సాక్షాత్తత్త్వజ్ఞానముతప్ప మఱియొకటి కాదు. పరతత్త్వ మొకవిధముగ నుండగ జనులు మఱియొక విధముగ యత్నించి క్లేశమొందుచున్నారు. మేక తన వీపునందే యున్నను గొల్లవాడు నూతిలో తొంగి చూచునట్లు, తమయందేకల తత్త్వము నెఱుగజాలక అనేకులు లోకమంతయు గాలించుచున్నారు.

శాస్త్రము లసంఖ్యములు. వానియొక్క అంతము చూచుటకు ఆయుర్దాయము చాలదు. ఆయువు అత్యల్పము. విఘ్నములా అనంతములు. కావున హంస నీటినుండి పాలను

గ్రహించునట్లు శాస్త్రముల సారమును గ్రహింపవలయును. ధాన్యార్థియగువాడు పొట్టును విడిచి గింజను గ్రహించునట్లు శాస్త్రములందలి తత్త్వమును ముముక్షువగువాడు పరిగ్రహింపవలెను. జ్ఞానముచేతప్ప మఱి యే మార్గమువలనను జీవునకు మోక్షము లభింపదు. గురువాక్యము ఒక్కటే మోక్షము నొసంగును.

'నాది' (మమ), 'నాదికాదు' (న మమ) అను రెండు పదములే బంధమోక్షములకు కారణములు. 'నాది' అనువాడు సంసారబంధములో పడును, 'నాదికాదు' అనువాడు మోక్షమును పొందును. ఏది సంసారబంధమును కలిగింపదో అదియే కర్మ. ఏది మోక్షము నొసంగునో అదియే విద్య. తక్కినకర్మయంతయు ఆయాసమునకు కారణము. తక్కినవిద్యయంతయు శిల్పనైపుణ్య ప్రదర్శనము. సంసారవాసన లెంతవఱకుండునో ఇంద్రియచాపల్య మెంతవఱకుండునో, మమకార మెంతవఱకు నిలుచునో, మనస్సున కెంతవఱకు స్థిరభావముకలుగుచుండునో, గురువుయొక్క అనుగ్రహ మెంతవఱకు లభింపకుండునో, అంతవఱకు తత్త్వజ్ఞాన మెట్లుకలుగును? కావున సర్వప్రయత్నములచేతను, సర్వావస్థలయందును, తత్త్వనిష్ఠుడు కావలెను. దేనికి ధర్మము, జ్ఞానము రెండు పుష్పములై యలరుచున్నవో, అట్టి మోక్షతరువును జీవుడు సత్వరమే ఆశ్రయించి, సంసార తాపత్రయములను అడంచుకొని, యమబాధను దూరీకృత మొనర్చుకొని పరమసుఖప్రాప్తి నొందునుగాక!!

ఓ గరుత్మంతుడా! శరీరములు స్థిరములుకావు ఐశ్వ ర్యము బుద్బుదప్రాయమైనది, మృత్యువు సదా జీవునకు సన్నిహితమైయుండును.

> అస్థిరాణి శరీరాణి విభవో నైవ శాశ్వతః
> నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మసంచయః.

కావున మానవుడు తన జీవితకాలము పూర్తియగు లోపలనే పెక్కు ధర్మకార్యములను, దానములను, త్యాగ పూరిత క్రియలను ఆచరింపవలెను. తన చేతితో చేసికొనిన దానము స్వల్పమైనప్పటికిని అక్షయమై యమమార్గమున చాల ఉపకరించును. దానధర్మములు చేసికొనిన మనుజులు స్వర్గపాథేయమును బడసి సుఖించుదురు. అట్లు చేయనివారు యమమార్గమున జేరి తినుటకు తిండిలేక మలమలమాడుచు ప్రయాణము సలుపవలసివచ్చును.

మహత్తరపుణ్యము చేసికొనినగాని మనుష్యజన్మ లభించదు. దుర్లభమగు ఇట్టి మనుష్యజన్మమునెత్తి ఎవరు ధర్మము చేయుదురో వారు స్వర్గాది పుణ్యలోకములను బొందుదురు. ధర్మము చేయనివారు దుఃఖములను, నరకము లను పొందుదురు. ధర్మాచారమువలన మానవజన్మము సఫలమగును ధనము, పుత్రులు, భార్య, బంధువులు, శరీరము మొదలగునవియన్నియు అనిత్యములు. కావున శీఘ్రముగ ధర్మము నాచరింపవలెను.

కొయ్య, మట్టిగడ్డ -వీనితో సమానమైన మృతదేహ మును భూమిమీద విడిచిపెట్టి బంధువులు విముఖులై వెడలి పోవుదురు. ధర్మము మాత్రము జీవునితోగూడ పోవును. ధనము గృహమునందు ఉండిపోవును. బంధువులు శ్మశా నమువఱకు వచ్చి అచట ఆగిపోవుదురు. పుణ్యము, పాపము, మాత్రము జీవునితోగూడ వెళ్లును. దుఃఖసాగరమగు ఈ సంసారమున వాస్తవముగ ఎవరికిని బంధువులు లేరు. కర్మ సంబంధమువలన జీవుడువచ్చి కర్మ ముగియుటతోడనే వెడలి పోవుచున్నాడు. మాతాపితృభ్రాత్రాది సంబంధము చలి పందిలియందలి జనసంగమువలెను, నదియందలి కాష్ఠసమా గమమువలెను చంచలమైనది,

ఇప్పుడు జీవులకు లభించు ధనము పూర్వజన్మమందు దానధర్మములు చేయుటవలననే సంప్రాప్తమైనదని యెఱుంగ వలెను. శ్రద్ధతో చేసిన దానము ధర్మము సద్గతినిచ్చును. శ్రద్ధ లేకుండ నొనర్చు కార్యములు ప్రయోజనకరములు కావు. శ్రద్ధతో పుష్పాదికమును సమర్పించినను నేను ప్రేమతో స్వీక రించుదును. అల్పమనికాని, అధికమనికాని లెక్కపెట్టక, శక్తి లోపము లేకుండ భక్తిశ్రద్ధలతోను, చిత్తశుద్ధితోను చేయు దానము స్వల్పమైనను అక్షయఫలము నొసంగగలదు. దాన ధర్మశీలురకు ఇహమునగాని, పరమునగాని ఉపద్రవములు కలుగనేరవు. మరణకాలమున యమదూతలవలనగూడ భయము కలుగకుండును. కాబట్టి జనులు యమబాధలనుండి

తప్పించుకొనుటకు ప్రయత్నపూర్వకముగ ఈ జీవితములో ధర్మప్రవృత్తిని, చిత్తశుద్ధిని, భగవద్భక్తిని సంపాదించవలయును.

జీవుడు మరణకాలమున చేయవలసిన పనులనుగూర్చి విష్ణుభగవానుడు గరుత్మంతున కిట్లు విధముగ దెలిపెను—

ప్రారబ్ధకర్మవశమున సంప్రాప్తమైన ఈ దేహము నెపుడు విడువవలసివచ్చునో, అపుడు మానవుడు తులసీసన్నిధానమున గోమయముతో మండలము చేయవలెను. ఆ మండలమున నువ్వులుచల్లి దర్భలను పఱచి పవిత్రమగు ఆసనమున సాలగ్రామశిల నుంచవలెను. ఎచట సమస్తపాపభయాపహమగు సాలగ్రామశిల యుండునో, ఎచట సంసారతాపహారమగు తులసిచెట్టుయొక్క ఛాయ యుండునో అచట మృతినొందినవారలకు మహాదుర్లభమగు ముక్తి సంప్రాప్తించును. ఎవని గృహమున తులసీవృక్షముండునో ఆ గృహము పుణ్యతీర్థమయమగుటచే యమకింకరు లచటికి వచ్చుటకు భయపడెదరు.*

తులసీదళమును ధరించి యెవడు మరణించునో, అతడు మహాపాపాత్ముడైనను యము డాతనిని చూడనేరడు. తులసీదళమును ముఖమందుంచుకొని, తిలదర్భాసనాసీనుడై మృతినొందువాడు పుత్రహీనుడైనను విష్ణుపురమగు వైకుంఠమును బొందును. ఇవ్విషయమున సందేహములేదు.

---

*తులసీకాననం గృహే యస్యావతిష్ఠతే
తద్గృహం తీర్థరూపం హి నాయాన్తి యమకింకరాః.

పవిత్రములగు తిలలు (నువ్వులు), దర్భలు, తులసి అను ఈ మూడు వస్తువులును, నరకమునకుబోవు మనుజులను స్వర్గమునకు గొనిపోవును. తిలలు నా శరీరమునుండి పుట్టుట వలన పవిత్రములగుటచే వానిని జూచుటతోడనే అసురులు, దానవులు, దైత్యులు పలాయనము చిత్తగించుదురు. నా రోమములవలన సద్భవించిన దర్భలు నాయొక్క విభూతియని తెలిసికొనుము. వానిని స్పృశించుటచే జనులు స్వర్గమును బొందుదురు. దర్భయొక్క మొదట బ్రహ్మదేవుడును, మధ్య విష్ణువును, చివర శివుడును నివసించియుందురు. కాబట్టి దర్భలు అగ్ని, మంత్రములు, తులసి, బ్రహ్మవిష్ణులు, గోవులు, పవిత్రములుగా చెప్పబడినవి.

గోమయముచే అలుకబడినదియు, దర్భలుంచబడినదియునగు స్థలమున ఆతురుని (మృతినొందబోవువానిని) పరుండబెట్టవలెను. మంచము మున్నగువానిపై పరుండబెట్టరాదు. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, సమస్త దేవతలు, అగ్నియు మండలము నధిష్ఠించియుందురు. కావున మండలము గావించి ఆతురుని అందు పరుండబెట్టవలెను. పిమ్మట నాతనికి సాలగ్రామతీర్థము నీయవలెను. సాలగ్రామతీర్థము సేవించువారు సమస్త పాపవర్జితులై వైకుంఠమును బొందుదురు.

తదుపరి, సమస్తమహాపాతకములను నాశనముచేయునదియు సమస్త తీర్థస్నాన, సమస్తదాన మహాపుణ్యమునొసంగునదియు నగు గంగోదకము నీయవలెను. శరీరశుద్ధికరములగు వేయి చాంద్రాయణములను జేసినవాడును,

గంగోదకము త్రాగినవాడును సమానులని యెఱుఁగుము. అగ్నిస్పర్శవలన దూదికుప్పయంతయు దగ్ధమగునట్లు, గంగోదకమును పుచ్చుకొనుటవలన సమస్తపాపములు నశించును. సూర్యకిరణములచే తప్తమయిన గంగోదకమును పానము చేయువాడు జన్మరహితుడగును. యమున, కృష్ణవేణి, కావేరి మొదలైన మహానదులు అందు స్నానముచేసినవారిని పవిత్రులుగ జేయును గంగానది దర్శనమువలనను, స్పర్శనమువలనను, పానమువలనను 'గంగ, గంగ' అని యెల్లపుడును కీర్తించుటవలనను పునీతులను గావించును. కావున సంసారతారకమగు గంగోదకమును పానముచేయవలయును. ప్రాణములు కంఠగతములై యున్నపుడు ఎవడు 'గంగా! గంగా' అని స్మరించునో అతడు విష్ణుసామ్రాజ్యమునుబడసి మరల ఈ పృథివిపై జన్మింపకుండును. ప్రాణములుపోవునపుడు ఎవడు గంగను స్మరించునో ఆతడు ఉత్తమగతిని బొందును. కావున గంగను స్మరించవలెను గంగోదకమును పానము చేయవలెను.

తరువాత మోక్షప్రదమగు శ్రీమద్భాగవతమును శ్రవణము చేయవలెను. అవసానకాలమున భాగవతము నందలి యొక శ్లోకమునైనను, అర్ధశ్లోకమునైనను, శ్లోకపాదమునైనను ఎవడు వినునో, అతడు పునరావృత్తిరహితమగు శాశ్వత బ్రహ్మలోకమును బొందును. వేదమునైనను, ఉపనిషత్తులనైనను, శివస్తోత్రములనైనను, విష్ణుస్తవములనైనను ఎవరు పఠింతురో, వారు మోక్షమును పొందుదురు.

ఈ ప్రకారముగా విహితాతురకృత్యుఁడగు ధర్మాత్ముని ప్రాణవాయువులు ఊర్ధ్వచ్ఛిద్రములగుముఖాదులనుండి సుఖముగా వెడలిపోవును. నాభిప్రదేశమున మిళితములగు ప్రాణాపానములు ఎప్పుడువిడిపోవునో, అపుడు ప్రాణవాయువు సూక్ష్మమై దేహమునుండి వెడలిపోవును. అపుడు నిరాధారమగు వృక్షమువలె శరీరము క్రిందపడిపోవును. ప్రాణములు పోవుటతోడనే శరీరము నిశ్చేష్టితమై, దుర్గంధభూయిష్ఠమై సర్వనింద్యమై యుండును. ఇట్టి తుచ్ఛతర దేహమును పొందియు మానవు లేల గర్వింపవలెను? మరణకాలమున స్థూలదేహమునగల పృథివియంశము పృథివియందును, ఉదకము ఉదకమునందును, అగ్ని అగ్నియందును, వాయువు వాయువునందును, ఆకాశము ఆకాశమునందును కలిసి పోవును.

వాస్తవముగ సర్వవ్యాపియు, నిత్యముక్తుఁడును, జగత్సాక్షియు, షడ్భావవికారరహితుఁడును అయియున్న జీవుఁడు అజ్ఞానవశమున ఇంద్రియసహితుఁడై, శబ్దాదివిషయయుక్తుఁడై, అరిషడ్వర్గసమన్వితుఁడై, పూర్వకర్మయుతుఁడై, గృహస్థుఁడు గృహము దగ్ధముకాఁగా ఇంకొక క్రొత్తగృహమున ప్రవేశించునట్లు పూర్వకర్మానురూపమగు నూతన దేహమున ప్రవేశించుచున్నాఁడు. జీవితకాలమున దానధర్మపరుఁడై యుండినచో ఆ జీవుని మరణకాలమున దేవదూతలు స్వర్గమునకు గొనిపోవుదురు. అత్తఱి యా దానధర్మపరుఁడు దివ్యదేహధారియై దివ్యాభరణశోభితుఁడై, మహానుభావుఁడై

దేవతలచే పూజింపబడుచు దివికేగును. కావున మనుజుడు తన జీవిత కాలముననే పెక్కు దానధర్మములు, పరోపకార కార్యములు ఆచరించి శుద్ధుడైనచో ఇక మరణకాలమున గాని, మఱి యెపుడైననుగాని, ఏ లోకమునగాని అతనికి యమబాధలు కలుగనేరవు. పైపెచ్చు శాంతిసుఖములనే అనుభవించుచుండును.

## మోక్షప్రాప్తి

ఓ గరుత్మంతుడా! జ్ఞానము శాస్త్రమువలన పుట్టినదని వివేకమువలన పుట్టినదని రెండు విధములు. శబ్దబ్రహ్మము శాస్త్రసంబంధము, పరబ్రహ్మము వివేకసంబంధము. కొందఱు అద్వైతము నిచ్ఛగించెదరు. కొందఱు ద్వైతము నిచ్ఛగింతురు. కాని ద్వైతాద్వైతముల కతీతమైన తత్త్వము వారు తెలిసికొనుటలేదు. "నాది, నాది కాదు" అను రెండు పదములే బంధమోక్షములకు కారణములు. "నాది" అనిన ప్రాణి (సంసార) బంధములో బడును. "నాది కాదు" అనిన మోక్షమును పొందును. ఏది సంసార బంధమును కలిగింపదో అదియే కర్మ. ఏది మోక్షమునిచ్చునో అదియే విద్య. తక్కిన కర్మ ఆయాసమునకు కారణము. తక్కినవిద్య శిల్పనైపుణీ ప్రవర్తకము. కర్మలెంతవఱకు ఫలోన్ముఖములగునో, సంసార వాసన ఎంతవఱకు నుండునో, ఇంద్రియాదాస్యమెంతవఱకు నుండునో అంతవఱకు తత్త్వజ్ఞానమెట్లులభించును! ఎంతవఱకు దేహాభిమానముండునో, మమకారమెంతవఱకు నిలుచునో

ఎంతవఱకు మనస్సునకు స్థిరభావము కలుగదో, ఎంతవఱకు శాస్త్రచింతన కలుగదో, గురువు అనుగ్రహము ఎంతవఱకు గలుగదో అంతవఱకును తత్త్వజ్ఞాన మెట్లు లభించును? ఎంత వఱకు తత్త్వము తెలియదో అంతవఱకే తపస్సు, అంతవఱకే వ్రతములు, అంతవఱకే తీర్థయాత్రలు జపము, హోమము, పూజయు నంతవఱకే వేదశాస్త్రాభ్యాసము నంతవఱకే. ఆ కారణమువలన సర్వప్రయత్నముచేతను, సర్వావస్థల యందును (మోక్షాసక్తియున్నచో) తత్త్వనిష్ఠుడు కావలెను. దేనికి ధర్మము, జ్ఞానము పుష్పములో, స్వర్గము, మోక్షము ఫలములో తాపత్రయములను బోనడుచు ఆ మోక్షవృక్షము నాశ్రయింపవలెను.

కనుక గురుముఖతః జ్ఞానము ద్వారా ఆత్మతత్త్వము నెఱుగవలెను. దానివలన మానవుడు అనాయాసముగ మోక్షమును బడయును. యమబాధను తప్పించుకొనును. తత్త్వజ్ఞానము కలిగినవానికి అంత్యకాలమున చేయవలసిన కృత్యమును చెప్పెద వినుము. దానివలన బ్రహ్మనిర్వాణ పదవిని పొందును.

అంత్యకాలము వచ్చినప్పుడు మనుజుడు అసంగము అను శస్త్రముచేత దేహాభిమానమును తెగగొట్టుకొనవలెను. పిదప ధైర్యముతో గృహమునుండిపోయి పుణ్యజలములలో స్నానముచేసి యథాశాస్త్రముగ కల్పితమగు ఆసనమున వివిక్తస్థలమున గూర్చుండి మనస్సున ఓంకారమును జపించుచు, జితశ్వాసుడై దృష్టిని విషయవాంఛల

మీదికి బోకుండ జేసికొని భగవద్రూపమున నిలిపి "నేను పరబ్రహ్మమును, పరంధామమును, పరమపదమును." ఇట్లు భావించుచు నిర్మలమగు మనస్సును ఆత్మయందు బద్ధము గావించుకొని నన్ను స్మరించుచు ఎవడు "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" అని స్మరించుచు దేహమును విడుచునో వాడు పరమ పదమును బడయును జ్ఞానము, వైరాగ్యమును లేని దాంభికులు ఎచ్చటకుబోరో అక్కడకు బుద్ధిమంతులు వెళ్ళుదురు. కోపము, మోహము లేనివారు, సంగదోషరహితులు, అధ్యాత్మనిత్యులు, కామరహితులు, సుఖదుఃఖములు, శీతోష్ణములు మున్నగు ద్వంద్వములను విడిచినవారును అగు జ్ఞానులు అవ్యయమగు పరమపదమును పొందుదురు. రాగద్వేషములను మలము లేనిదియు, సత్యము అను జలముగలదియు అగు జ్ఞానతీర్థమున ఎవడు స్నానము చేయునో వాడు మోక్షమును బడయును.

సంపూర్ణమగు వైరాగ్యమును బొంది నామీదనే మనస్సునుంచి భజించుచు పూర్ణదృష్టియు, ప్రసన్నాత్మయు గలవాడు మోక్షమును పొందును. అట్టివానికి యమలోక బాధ ఏకాలమందును ఉండదు.

గరుత్మంతుడా! నీకు జెప్పిన సనాతనమును, జ్ఞాన వైరాగ్యసహితమును, యమబాధానివారణారూపమునగు ఈ మోక్షధర్మము నెవడు వినునో వాడు మోక్షమును పొందును. తత్త్వజ్ఞానము కలవారు పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మ లోకమును బడయుదురు. ధర్మమార్గనిరతులు స్వర్గమును

పొందుదురు. పాపాత్ములు నరకమునకు బోవుదురు. పశువులు, పక్షులు, కీటకములు మున్నగునవి పుట్టుచు జచ్చుచు నుండును. ఇట్లు నీకు నేను సకలశాస్త్రముల సారమును చెప్పితిని. ఇక నేమి వినదలచెదవు?

శ్రీహరి యిట్లు చెప్పగా విని గరుడుడు కృతాంజలియై శతసహస్ర ప్రణామములర్పించి "భగవంతుడా! దేవదేవా! అమృతవాక్యములను వినిపించి భవసాగరమునుండి నన్ను తరింప జేసితివి. సందేహము తొలగిపోయినది. కృతార్థుడనైతిని–సంశయ మేమియు లేదు" అని చెప్పి గరుత్మంతుడు ధ్యాననిమగ్నుడయ్యెను.

ఏ హరి తన్ను స్మరించుటవలన దుర్గతిని తొలగించునో, పూజించుటవలన సద్గతిని గలిగించునో, తనయెడల భక్తి కలిగియుండిన ముక్తినిచ్చునో ఆ శ్రీహరి జనులను రక్షించుగాక.

ఓం తత్ సత్.

యమలోక వార్తలు సమాప్తము.

# వసిష్ఠగీత

## (అను సంక్షిప్త యోగవాసిష్ఠము)

శ్రీ వసిష్ఠమునీంద్రులచే శ్రీరామచంద్రున కుపదేశింపబడిన శ్రీ యోగవాసిష్ఠము మహోన్నత ఆధ్యాత్మిక గ్రంథముయొక్క సారమే ఈ వశిష్ఠగీత. 8 వేల శ్లోకములతో కూడినది. మూలశ్లోకములు, తెలుగు తాత్పర్యము కలవు, ఇది నాలుగు భాగములు గలిగి రెండు సంపుటములుగ అచ్చు వేయబడియున్నది. ముముక్షువుల కిది పరమావశ్యకమైన గ్రంథము.

డెమ్మీసైజు - పూర్తిక్యాలికో బైండు

ప్రథమ సంపుటము—1150 పేజీలు - వెల రు. 18.00

ద్వితీయ సంపుటము—1127 పేజీలు - వెల రు. 18.00

ఒక్కొక్క సంపుటమునకు ప్లాస్టిక్ జాకెట్ - వెల రు. 2.00

# మోక్షసాధన రహస్యము

## రచయిత: శ్రీ విద్యా ప్రకాశానందగిరిస్వాములవారు

మోక్షముయొక్క స్వరూపమేమి? మోక్షమును పొందుటకు ఉపాయము లెవ్వి? వానివి సాధించుటెట్లు? మోక్షసాధనయందు ఏమే పద్ధతులు ఉపకరించును? మోక్షప్రాప్తికి అంతరాయము లెవ్వి? వానివి దాటుట యెట్లు? ఈ మొదలగు విషయములన్నియు తేటతెల్లముగ ఈ గ్రంథమున వివరింపబడినవి. సాధకులకు అత్యావశ్యకమైన గ్రంథము.

1/8 క్రౌను సైజు—675 పేజీలు—వెల రు. 12.00

(ప్లాస్టిక్ జాకెట్టు వెల రు. 1.50)

ఓం

*Be Fearless*

# దైవ ప్రార్థన

కరుణామూర్తియగు సర్వేశ్వరా! మా చిత్తము సర్వకాల సర్వావస్థల యందును నీ పాదారవిందములందు లగ్నమై అచంచలమైన భక్తితో కూడియుండునట్లు అనుగ్రహింపుము!

పరమదయానిధీ! ప్రాతఃకాలమున నిద్రలేచినది మొదలు మరల పరుండు వరకును మనోవాక్కాయములచే మావలన ఎవరికిని అపకారము కలుగకుండునట్లును, ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయఁగలుగునటు సద్బుద్ధిని దయచేయుము!

సచ్చిదానందమూర్తీ! నిర్మలాత్మా! మా యంతఃకరణమునందు ఎన్నడును ఏ విధమైన దుష్టసంకల్పముగాని, విషయవాసనగాని, అజ్ఞానవృత్తిగాని చొఁరబడకుండునట్లు దయతో అనుగ్రహింపుము.

వేదాంతవేద్యా! అభయస్వరూపా! మా యందు భక్తి, జ్ఞాన, వైరాగ్య బీజము లంకురించి శీఘ్రముగ ప్రవృద్ధములగునట్లు ఆశీర్వదింపుము. మరియు ఈ జన్మమునందే కడతేరి నీ సాన్నిధ్యమున కేతెంచుటకు వలసిన శక్తిసామర్థ్యములను కరుణతో నొసంగుము.

దేవా! నీవు భక్తవత్సలుడవు! దీనులపాలిటి కల్పవృక్షమవు! నీవు తప్ప మాకు ఇంకెవరుదిక్కు? నిన్ను ఆశ్రయించితిమి. అసత్తునుండి సత్తునకు గొనిపొమ్ము. తమస్సునుండి జ్యోతిలోనికి తీసికొనిపొమ్ము. మృత్యువునుండి అమృతత్వమును పొందింపజేయుము. ఇదే మా వినతి. అనుగ్రహింపుము. నీ దరి జేర్చుకొనుము. పాహిమాం, పాహిమాం, పాహిమాం. పాహి!

ఓం తత్ సత్.

---

(ఈ ప్రార్థనను ఎవరు ప్రతిదినము నియమముగా తప్పక ఉదయము నిద్రలేచునపుడు రాత్రి పరుండబోవునపుడు మనస్ఫూర్తిగా పఠించెదరో అట్టివారికి జీవితమునం దేలాటి దోషములున్నా కలుగకుండుటయే గాక భగవంతునియొక్క అనుగ్రహమునకున్ను వారు పాత్రులు కాగలరు.)